Regd No. N: 45 / M 3813

వెల ఒక అణా

★ బ్రిటను లో ఘోరములైన జర్మను విమానాల పోరాటములు ★

102824

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

★ ఆఫ్రికాలో ఇటలీ విమానాల చురుకుదనము ★

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ శ్రావణ శు॥ ౯ (౬-౧౧-౧౩౪౯ ఫ.) సోమవారము సంచిక ౨౯

# ఇండోచైనాకై ఫ్రెంచిప్రభుత్వముపై జపాను ఒత్తిడి

## ఫ్రెంచి ప్రభుత్వము లొంగకతప్పదు!

### ఇండోచైనా సమీపములో జపాను యుద్ధనౌకలు

ఇండోచైనామీద జపానుదాడి వెడలేయెడల నిరోధించుటకు ఫ్రాంసు నిశ్చయించుకొన్నటుల డెయిలీ మెయిలుపత్రిక ప్రకటించినది.

ఇండోచైనాలోని దేశీయసైన్యములను నిరాయుధము చేయునుత్తరువులు రద్దు చేయబడెనని సముద్రతీరరక్షణ దుర్గములన్నియును సైనికులతో నింపబడెను దూరప్రాచ్య దేశములనున్న ఫ్రెంచి యుద్ధనావలన్నియును ఇండోచైనాకు రావలసినదిగ నుత్తరువుచేయబడెను.

**జపాను సైనికాధికారి ప్రకటన**

దక్షిణచైనాలోని జపాను సైనికాధికారి ఈ [illegible] విషయములను తెలిపెను—

"జపానును ప్రతిఘటించుటకు తగినబలము తమ కున్నదనితలచి, ఇండోచైనాలోని ఫ్రాన్సు అధికారులు జపానును ఎదిరింపపూనుకొనుట అనర్థమును కొనితెచ్చుకొనువిధముననుండును. చంగుకింగుపంపుటకై చేర్చబడినయుద్ధసామగ్రిని, జపానుతనిఖీ ఉద్యోగులువచ్చులోపుగ ఫ్రాన్సు అధికారులు అచ్చటచ్చటికిపంపి దాచిపెట్టిరి"

## అమెరికానావను జపాను పట్టుకొనుట

వాషింగుటను, ఆగస్టు ౫

గతఆదివారమునాడు ఏష్లైలీఅను అమెరికా నావ చైనాకోస్తావద్ద జపానువారిచే పట్టుకొనబడినిర్బంధింపబడెను. అచటిఅమెరికా కాన్సలు ఆపనియైమై అడిగెను. కాని యింకను విడుదల చేయబడలేదు. తుపాను గాలివీచుటవల్లఆనావ వెంచో వద్దకు చేరెను. అచటకు ఏనావలువచ్చినను పట్టుకొనెదమని జపానువారు సముద్ర నిర్బంధనము చేసియుండిరి అందువల్ల ఆనావ జపానువారిచే నిర్బంధింపబడెను.

## బ్రిటనుకు జపాను సందేశము

టోకియో, ఆగస్టు ౬

నేటిదినముజరిగిన జపానుమంత్రివర్గపుసభలో ఇంగ్లాండు జపానుపౌరులు అరెస్టుచేయబడుటనుగురించి విదేశాంగమంత్రి మట్సుయోకగారు మంత్రులకు పూర్తివివరములు తెలిపిరి ఈ అరెస్టులను సమర్థించుచు బ్రిటిషు ప్రభుత్వమువారు తెలిపినకారణముల నెంతమాత్రము అంగీకరింప వీలులేదనియు ఈవిషయమైతమ అభిప్రాయములను స్పష్టపరచుచు జపానుప్రభుత్వమువారు బ్రిటిషుప్రభుత్వమునకొకసందేశముంపెరనియు, ఈ సందేశమునకు తగుప్రత్యుత్తరమురాగానే జపానుప్రభుత్వమువారు తగుచర్యతీసుకొనెదరనియు విదేశాంగమంత్రి ఒకప్రకటనగావించెను.

టోకియోలోని బ్రిటిషురాయబారి సర్ రాబర్టుక్రేగ్ గారు నేటిదినమువిదేశాంగమంత్రి మట్సుయోకగారిని సందర్శించి ౭౦ నిమిషములకాలము టోకియోలో బ్రిటిషుపౌరుల అరెస్టులు, లండనులో జపానుపౌరుల అరెస్టులగురించియు సంభాషణలు జరిపిరి

టోకియోలో సాల్వేషను ఆర్మీకమాండరు ఉయమూరగారు, కార్యదర్శి జెనరలు సెగావగారు మరి ౫ మంది అధికారులు, జపానుమిలిటరీ పోలీసువారిచే అరెస్టుచేయబడిరి. వీరు గూఢచారులుగ పనిచేయుచుండిరనియు ఈకారణమువల్ల వీరు అరెస్టుచేయబడిరనియు యుద్ధశాఖవారొక ప్రకటనగావించిరి.

### సింగపూరులో జపానుపౌరుని అరెస్టు

సింగపూరు, ఆగస్టు ౬

సింగపూరులో జపానుపౌరుడగుకోబయూషిగారు అరెస్టుచేయబడిరి. నేడుజపాను కాన్సలు జెనరలు టోజతగారు కాలనీలకార్యదర్శిని సందర్శించి ఈవిషయమైమాట్లాడిరి. డిఫెన్సు రెగులేషనుల క్రింద కోబయూషిగారు అరెస్టుచేయబడిరని కాలనీలకార్యదర్శి జపానుకాన్సలు జెనరలుగారికి తెలిపిరి.

### షాంగుహేలో ఫ్రాన్సు పోలీసు అధికారి హత్య

షాంఘై, ఆగస్టు ౬

షాంగుహేలోని ఫ్రెంచిపోలీసుశాఖకు చేరిన పాల్ యింకోలిన్స్కీ అనుఉద్యోగి ఫ్రాన్సుపేటలో వారిగృహమున చంపబడిరి. ఇటీవల షాంగుహేలో జరిగినఆరెస్టులవిషయమై వీరుప్రత్యేకముగ శ్రద్ధవహించి హంతకులను పట్టుకొనుటకై ప్రయత్నించుచుండిరను కారణమువల్ల వీరుచంపబడిరని ఊహింపబడుచున్నది.

### జపానునావలకు హాంగుకాంగు రేవు మూయబడుట

హాంగుకాంగు, ఆగస్టు ౫

౨౦ వేల టన్నుల ప్రమాణముగల పట్టాను అను బ్రిటనునావ రేవుఅధికారుల కివ్వవలసిన బాకీమొత్తము చెల్లింపనందున జపానుఅధికారులు ఈనావను కాంటనురేవులోనే నిలిపియుంచిరి. కాంటనురేవులోనికి ఎన్ని బ్రిటిషునావలు ప్రవేశింప జపానువారు అనుమతి యొసగెదరో అన్నిజపాను నావలను హాంగుకాంగు రేవులోనికి రానిచ్చుటకు బ్రిటిషువారు అంగీకరించియుండిరి, కాంటనురేవులో ఒకబ్రిటిషునావను జపానుఅధికారులు నిలిపియుంచినందున కెయిబూ మారు హకనమారు అను రెండుజపానునావలు హాంగుకాంగురేవు ప్రవేశింపకుండ బ్రిటిషువారు అడ్డగించిరి

### జపానులో నిర్బంధమునందున్న బ్రిటిషుప్రజలు

లండను ఆగస్టు ౫

నేటిదినము కామన్సుసభలో జపానులో నిర్బంధమునందున్న బ్రిటిషుపౌరులగురించి ఒకసభ్యుడు అడిగినప్రశ్నకు ప్రత్యుత్తరమిచ్చుచు బట్లరుగారు ఇట్లు చెప్పిరి

జపానుఅధికారులు మొత్తముమీద ౧౫మంది బ్రిటిషుపౌరులను అరెస్టుచేసిరి. వీరిలో ఒకరు మాత్రము విడుదలచేయబడిరి. ఇంకను [illegible] నిర్బంధమున నున్నారు ఈ విషయమై టోకియోలోని బ్రిటిషురాయబారి జపాను విదేశాంగమంత్రితో సంప్రతింపులు జరుపుచున్నారు ఈ అరుగురిమీద గావింపబడిన నేరారోపణలపై విచారణత్వరలోనే ముగింపబడునని ప్రభుత్వమువారు నమ్ముచున్నారు.

### షాంగుహేలో దౌర్జన్యకార్యములు

షాంఘాయి, ఆగస్టు [illegible]

షాంగుహేలో దౌర్జన్యకార్యములు [illegible] గుచున్నవి. నేటిదినము నలుగురుచైనా వారు [illegible] ధముగ ఎత్తుకొనిపోబడిరి రాజకీయ విభేదములే ఈదౌర్జన్యమునకు కారణమని తెలియుచున్నది.

## ఇండోచీనావైపు జపాను సేనలు

షాంఘాయి ఆగస్టు ౫

ఇండో-చైనాలో గంటగంటకు పరిస్థితులు తీవ్రమగుచున్నవి. జపానునౌకాదళములు, సైనికులతో నిండినవావలు దక్షిణచీనా సముద్రములందు తిరుగుటబట్టి జపాను దక్షిణమువైపు దాడిసలుపుటకు సిద్ధముగనున్నదని ఎంచబడుచున్నది.

ఫ్రెంచి ఇండోచైనాలో అధికారులు దేశరక్షణ ఏర్పాటులు ఎక్కువచేయుచు అతివడిగా టాంకులు, యంత్రాలు సరిహద్దులకు పంపుచున్నారు.

టాంకిను గల్ఫున దు ౨౦ జపాను యుద్ధనౌకలు కేంద్రీకరింపబడినవి ఫర్మోసానుండి పెద్దనౌకాదళం ఇండోచీనావైపు వచ్చుచున్నది.

గతకొద్దిరోజులలో జపానుస్టీమరులు ఫార్మోసానుండి హైనానుకి ఎక్కువగ పోవుచుండెను రెండుకోట్లరూముఖ్యముగా హైనానులో యుద్ధనౌకలు ఎక్కువగ ఉంచబడినవి. అనేక బ్రూయిజరులు విమానాలను మోసుకపోయెవి. డిస్ట్రాయరులు, రవాణానౌకలును ఉంచబడినవి. జపాను సేనలుచాల దక్షిణచీనానుండి హైనానునకు మార్చబడినవి.

ఇండోచీనాలో జపాను ఇన్స్పెక్టరుజనరలు గవర్నరుజనరలుకి పంపినసూచనలకు ఫ్రెంచివారీయనున్న జవాబునకై ఎదురుచూచుచున్నారు ఇండోచీనాలో తమనౌకాదళము, విమానదళాలకు శిబిరాలు నిర్మించవలెననియు, అక్కడినుండి చీనాలోని కునుమింగుపై దాడిసల్పుటకు సేనలను రవానాచేయుటకు అనుమతియు జపానుకోరుచున్నది.

### ఫ్రెంచిప్రభుత్వవైఖరి

షాంఘాయి, ఆగస్టు ౫

ఇండోచీనా విషయమై ఫ్రాంసువారు నిశ్చలమగువైఖరి నవలంబించుచున్నారనియు, అవసరమైనచో ఆయుధబలముతో జపానునెదుర్కొన సిద్ధముగానున్నారనియు విచీప్రభుత్వమువారు తమరాయబారిద్వారా చంకింగులో నెలకొనియున్న చీనాప్రభుత్వమువారికి తెలియజేసిరి.

## ఇటలీ బ్రిటనుల యుద్ధము

ఇటలీ బాంబరువిమానాలు ఆగస్టు ౫వ తేదీ "మెర్సామాత్రు" అనుకోటపై బాంబులువేసెను. మాల్టా పైకిపోగా తరిమివేయబడెను లిబియా గోబిప్రాంతంలో బ్రిటిషువిమానాలు ౫౦ ఇటలీ విమానాలనెదుర్కొని పోరాడి మూడుఇటలీ విమానాలను క్రిందికి గాల్చెను బ్రిటిషువిమానాలు ఇరిట్రియాలో డాగబూరుప్రాంతంమీదను మసారాహార్బరుయొద్దను బాంబులువేసెను ఆగస్టు ౩వ తేది శత్రువిమానాలు వలీదుపైకివచ్చి బాంబులువేసెను. బ్రిటిషువిమానాలు వాటినితరిమెను. ఇదేరోజు ఇటలీవిమానాలు హైఫాపై బాంబులువేసిరి

ఆగస్టు ౨వతేది ఓబియాపై ఇటలీవిమానాలకును బ్రిటిషువిమానాలకును, ఇదివరకెన్నడు జరుగనంతటిగొప్పపోరాటముజరిగెను. అందులో ౧౫ ఇటలీవిమానాలు, రెండు బ్రిటిషువిమానాలు నష్టమయ్యెను. ఇదేరోజు ఇటలీవిమానాలు మెర్సామాత్రుపైకూడ బాంబులువేసెను,

ఇకస్థల సేనలసంగతి జూచెదము. సోమాలిలాండుపైదాడి ఆగస్టు ౪వతేది ఇటలీయులచే ప్రారంభించబడెను ఇటలీసేనలు ఒడ్వీనాకువైపు కొన్ని, హార్గెసియావైపుకొన్ని, గారాగారావైపుకొన్ని ఇట్లుమూడు ముఖములుగా దాడిచేయుచున్నవి. ఈసేనలు ఏడెన్ గల్ఫుపైకిని, బెర్బెరా జీలారేవుల వైపును పోదలచినట్లున్నది

ఆగస్టు ౫వతేది ఇటలీసేనలు జీలాలో ప్రవేశించి, హార్గెసాను పట్టుకొనెను, బ్రిటిషుసేనలు వెనుకకుపోయెను. ౬వ తేది ఇటలీసేనలు ఓడ్వీనాను పట్టుకొనెను. తర్వాత ఆసేనలు ఉత్తరమువైపు పోసాగెను.

కెన్యాప్రాంతంలో ఆగస్టు౬వతేది బునాజాపురోగమించిన ఇటలీసేనలను కొన్నిటిని బ్రిటిషుపహారాసేనలెదుర్కొనగా, అవి చెల్లాచెదరై పారిపోయెను లిబియా తూర్పు సరిహద్దువద్ద బ్రిటిషు సేనలున్నవి

ఈజిప్టుప్రాంతంలో బ్రిటిషు యుద్ధనౌకలు సర్వదాజాగ్రత్తగ కాపాడుచున్నవి. అందుచే ఇటలీసేనలు అబిసీనియానుండియు, లిబియానుండియు బ్రిటిషుసేనలపైకి త్వరలో దాడివెడలుటను నిశ్చయించుకొనినట్లు తెలియుచున్నది.

## చంకింగు నగరముపై బాంబులవర్షము

షాంఘాయి, ఆగస్టు ౧౦

౯౦ జపాను విమానములు మూడుసారులువచ్చి చంకింగునగరముపై నేటిసాధ్యాహ్నము బాంబులనువర్షించినవి, ఇప్పుడు షాంఘాయిలోను, ఉత్తరచైనాలోను ఉంచబడిన బ్రిటిషు సేనలు వేరొకచోట అవసరమగుటచే అక్కడికిగొనిపోబడెను. ఈసంగతిని జపానువారికి బ్రిటిషువారు తెలిపిరి అమెరికావారికికూడ యీసంగతి తెలియజేసిరి. షాంఘాయిలో ఇప్పుడున్న బ్రిటిషుసేనల సంఖ్య దాదాపు ౧౫౦౦ మంది!

## ఫ్రెంచిప్రభుత్వమువారికి జపానీయుల హెచ్చరిక

అధమపక్షము ఫ్రెంచిఇండోచైనాలో సేనానివేశములను, నౌకానివేశములను, విమాననివేశములను స్థాపించుకొనుటకును, ఫ్రెంచిప్రదేశముగుండా యూనాను రాష్ట్రములోనికి జపానుసేనలను పోనిచ్చుటకును ఫ్రెంచి ప్రభుత్వమువారు అంగీకరించనిచో జపానువారు యుద్ధమునకు దిగగలమని బెదరించుచున్నారు. జర్మనీ, ఇటలీల ప్రభుత్వములు ఫ్రెంచిప్రభుత్వమువారిని జపాను కోరినషరతులకు అంగీకరించవలసినదని కోరవచ్చును. అందువల్ల ఫ్రెంచిప్రభుత్వము లొంగవచ్చునని "డెయిలీహెరాల్డు" పత్రికయొక్క విలేఖరి తెల్పినాడు.

జపానుయుద్ధనావలు, సరకులను మనుష్యులను గొనిపోవు నావలు హైనాన్ ముట్టగు ఇండోచీనా కావలిరేవులకు ప్రతిరోజును చేరుచున్నవి.

## అరెస్టు

ఖమ్మం, ఆగస్టు ౫

(విలేఖరి)

గోడలమీద "జర్మనుకేజయము" అనుకాగితములు అతికించినారను నేరముచే నిన్నటి ఉదయముఖమ్మమ్ నివాసియగుచెన్నకృష్ణగారిని, వారిసహచరులు వీరభద్రంగారిని తల్లంపాడు పోలీసుస్టేషనులో అరెస్టుచేసిరి. అనుమానమువలన [illegible] మొదలు ప్రముఖులుకొందరు అరెస్టుకావింపబడిరి. ఇంకనుకొందరిని అరెస్టుచేయుదురను సూచనలు కనబడుచున్నవి విచారణ ఇంకను జరుగలేదు.

## శారదాచట్టపు ఆమోదము

[illegible] ఆగస్టు ౪

(ఓ. వి)

ఆర్లీనగరములో నేడు పురజనులందరు చావ రామకృష్ణయ్యగారి అధ్యక్షతన సమావేశమై, వలాక్పురపు సప్తమాంధ్రసభవారి 'బాల్యవివాహనిరోధక' తీర్మానమును బలపరుస్తూ మనుని. ప్రభుత్వమువారిని వెంటనే అమలుజరుపవలసినదిగా కోరుచున్నారు. బాల్యవివాహవర్ణములనుగురించి శ్రీవట్టికొండ నాగేశ్వరావుగారు విందలైనవారు ఉపన్యసించారు.

ఈముస్లిం కోతమందు సనాతనులు బాల్యవివాహమున సవర్థిస్తూ, అమాయకప్రజలచే విజ్ఞప్తులమీద అమోదించినట్లు వేలిముద్రలను వేయించుటను ఈసమావేశము ఖండిస్తూ అట్టిమోసకృత్యములకులోబడవద్దని ప్రజలను హెచ్చరించవలెనైనది

### ౫౦౦ పౌనులు

హైదరాబాదు(దక్కన్)షహరనుకు [illegible] సర్ [illegible] గారు చనిపోయినందున వారిచెల్లెలికూతురుకు జీవనాధారముగా ౫౦౦ పౌనులు [illegible] ప్రభువుగారు పంపియున్నారు

సంస్థానములలో

# ప్రజా ప్రభుత్వము

కావలెనని అఖిల ప్రపంచము ఆందోళన పడుచున్నది.

ప్రజాప్రభుత్వము ననుభవించుచున్న

# ఔంధు సంస్థానము

చరిత్ర చదివి, ప్రజాప్రభుత్వ ప్రశాసన సంబద్ధ నాయకులకూర్చి

ఔంధు రాకుమారుడు వ్రాసిన వ్యాసమును, అందలి విశేషములను గ్రహించండి.

౫ అణాలు దేశోద్ధారక గ్రంథమాల సికింద్రాబాదు

# పల్లె పాటలు

ఈ క్రింది పాటలు రాయపురమునుండి
టి. వెంకటనారాయణ
దీనబంధుగారిచే పంపబడినవి.

ఈక్రిందిపాటలు మాగ్రామములోని కృషికుల పిల్లలగు నవయువకులు కామదహనమురోజు ఇల్లిల్లుదిరిగి ధాన్యము, పైసలు- పిడకలు, కట్టెలు ప్రోగుజేయుచు పాడుచుందురు.

౧

జాజిరి జాజిరి జాజిరికి జల్బం
జాజర్యాడావే సన్నపురిసాప
కోటిమీద రెండు పేరంగిపిట్టల్
మిరిసేటికాముని రొమ్మున జెడలు
పురి కెదివ్నా పూరి కస్తూరి కక్క-
కస్తూరికాముడు యెసువంటివాడో
భూమికన్నముం బుట్టినవాడు
భుజానగొడ్డలి బెట్టినవాడు
మీదికిబొయ్యి దుర్గమునరికే
కిందికివచ్చి బల్లమునరికే.

౨

గొల్లోడ గొల్లోడ గొర్లేడబోలినావు
నినో కటిబాయె మొన్న కటిబాయె
బోయిన పున్నమనాడు పొట్టేలుబాయె
పొట్టేలుకొమ్ములు లొట్టలుబాయే
లొట్టలనిండ నీళ్లు నిలిచె
నీళ్ళపుణ్యాన నాసుబడె
నాసుపుణ్యాన కప్పలుబడె
కప్పలారా మీరేమి జేయుచున్నారు?
యేటిగడ్డకు వ్యవసాముబెట్టినం
యేటిగడ్డకు వ్యవసాము బెట్టె
యిరిశిరికిగొడ్డే యిరజైపుట్లు
ఆరిపరికిగొడ్డే అరుజైపుట్లు
అన్ని తోసుకపాయె గంగిశెట్టినరుసయ్య
గాసాని కిబోతే మీసాలుదువ్వుతాడు
గడెగడెకుపోతే గడ్డముదువ్వుతాడు
మాలవాసముతోటి మాతిరిగగొట్టె
మాతికిబట్టెరా మాదుదక్కోళ్లామిదం
మాదుదక్కోళ్లకు పైసనేరేదు
పైసలేకుంటే పయ్యోద్దునమ్ము
పయ్యోద్దు నమ్మితే పంటకేమిలేదు
పంటకులేకుంటే పడెన్న సావు

ఇదే కామదహనమురోజు పురుషులవలెనే విద్యావిహీనులగు గ్రామపుస్త్రీలుగూడ యిల్లిల్లుదిరిగి యీపాట బాడుచుందురు.

3

కాముకామయో కామునోక్లేమే
కాముడొచ్చిండు కొళ్లగడుగారే
భీముడొచ్చిండు పీటలెయ్యారే
పేమువచ్చినాము శెనగలుదేమ్మా
శెనిగెలు దెచ్చేరా జలకమాడంగా
జలకమాడంగా జామ్ముప్రొద్దెక్క-
గూరుగూరు గున్నచింత
నాల్గుకెయిలా రాయి ప్యాటా
నట్టనడుమ దొమ్మరిల్లు
దొమ్మరింటి దొడ్డబిడ్డ
చిక్కు తీసి కొప్పుబెట్టె
చీరగంధము నొస్టబెట్టె
అల్లిబిల్లి చెప్పులుదొడిగి
ఆరెబరిగె చేతబట్టె
యేడకబోతవు జానకమ్మ
పుప్పునీళ్ల బాయిలోనే
పుల్లెబంతు లాడబోత
మంచినీళ్ల బాయిలోనే
మిల్లెబంతు లాడబోత.

౪

గ్రామములోని విద్యావిహీనులగు కన్యలు యించుమించుగా నన్నియిండ్లలో సామాన్యముగా ౧౨,౧౩ వర్షముల వయస్సులోనున్నవారే ఇద్దరిద్దరుకలిసి దుముకుచు గంతులువేయుచు యీక్రిందిపాట పాడుదురు.

చెమ్మచెక్కలో చారెడేబుక్కలో
అట్లుబొయ్యంగా, ఆరగించంగా
ముత్యాలరోకటికి ముగ్గుగొట్టంగా
పగడాల రోటికి పందిరెయ్యంగ
పండిట మామామ పెండ్లిజెయ్యంగా
ఎర్రగుర్రమెక్కిసాడు, యెలిరుగబడ్డాడు
కర్రెగుర్రమెక్కిసాడు, కాలిరుగబడ్డాడు
ముసలిగుర్రమెక్కిసాడు, మూతిరుగబడ్డాడు
మాయత్త మామామదగ్గర
అత్తకోడుకు నాదగ్గర
కొర్ర గజ్జ కంకోణము
ఏటిచుక్క ఎలిగేపండు
మామిడిమొగ్గ మల్లెసాల
లింగులిటక్ పంచిరిపటక్

౫

వెనుకా వెనుకా వేములతోట
కనకాపండ్లు కామునిరూప్రల్
మెత్తనిగోళ్లు యేకాశంఖులు
దూదీమడుగులు దుప్పటిరేకల్
వాగులనీళ్లు వ. ము లపట్రి
తెల్లనిగుళ్ళో నల్లనివెంకయ్యకు
నా లుగుచేతుల నమస్కారము

౬

యీపాట విద్యావిహీనులగుస్త్రీలు తిరుగలిపై పాడుచుందురు.

అవదొట్లనుంచి యీరుట్లనుంచి
ఆబాలబిడ్డారు అడవచ్చితి
వెలదికొంగుబట్టి విడవడారొబా
మాకొంగువిడురాజమేముబొయ్యేదము
మాయమ్మ యింటిలో మరికోపపడును
మీయమ్మ వినకుంట మాటరాకుంట
మునివేలునున్నది ముద్దుటుంగరము
దీనిని మీయమ్మ కొనవాలంపు
అనవాలు జూచుకొని అనుమానపడెను
యెన్నవంటి సున్నము వెయిలకస్తూరి
వలతినిప్పరో కాని శేడునన్నారు
పాలవటిసున్నము పచ్చికస్తూరి
పణతినెవ్వరో కాని భంగపరచిరి
నల్లింది పైటకొంగు జారినదురులు
వడిజారి వడినిండ మ్యాడపడిపెట్టి
గల్లుగల్లునవచ్చి గడపద్దనిలిచి
అమ్మరో వోయమ్మ గడదీయవమ్మ
నీవురెవ్వారాని నేడీతుగడలు
అన్నలకు చెప్పాలని యాడుబిడ్డను
గల్లుగల్లునవచ్చి గడపైనతీసి
తల్లిబిడ్డ మొకాలు తప్పకజూచి
వాలించి నీముఖము వాడుదేలింది
తీరుమీదతీరు తీరునుబొక్కడిది
శ్రీరంగరాయుడు నీయల్లుడమ్మ
కొమ్మమీదనిమ్మ గొలలాడెరమ్మ
గోపాల క్రిష్ణమ్మ నీయల్లుడమ్మ
వెండిపిల్లనుగొయ్య వెలదోలిపట్టి
యెలమోరివాడల్ల వచ్చేకిష్టమ్మ
పగిడిపిల్లనుగొయ్య బాగుగాబట్టి
బాపనోరివాడల్ల వచ్చేకిష్టమ్మ
రాగిపిల్లనుగొయ్య రాచవరిపట్టి
రాచవారివాడల వచ్చేకిష్టమ్మ

౭

జోపాట

పులపుల లాయమ్మా పులపులలాయీ
యేమునకు యేమువమూ యెడ్డిగోపాలా
యేడ్చినా నిన్నెవరు ఎత్తుకునెవారు
పూరుక్కుంటె నీకెంత పుస్తుబోనేరు
రాయమ్మరత్నాలు కీలమ్మ జెడలు
కోల దేవేపట్ట లన్నిగొట్ట
పిట్టరాజేపిట్ట పిల్లలతల్లి
పిల్లలకు పాలిచ్చి పల్లెలనుబోవే
పల్లెల్ల పండ్లన్ని బాలునకుదేవే
చిన్నారి పొన్నారి చిలుకపునీవు
నిద్రాకువచ్చినవు మబ్బుదట్టినావు
నిద్రబో బలభద్ర రామకోమారా
నిద్రకు నూరేండ్లు నీకువెయ్యేండ్లు
నీకగన్నతల్లికి నిండనూరేండ్లు

## కళాశాల విద్యార్థుల దుష్ప్రవర్తనము

హైద్రాబాదు(దక్కన్) పహారేవరుకెగ బొలారంనుండి ఫలక్నుమాకుబోవునట్టి హైద్రాబాదు లోకల్ రైలు (అంసబ్) గతసోమవారమునాడు ౮॥ నిముషాలవరకు ఎక్కువగా అపవలసివచ్చెను. ఎందుకనగా ఉస్మానియావిద్యార్థులు రైల్వేఉద్యోగులతో తగవుపెట్టుకొనిరి. ఈవిద్యార్థులు మూడవతరగతిలో కూర్చున్నారట గార్డున్న టికెటుకలెక్టరున్ను వారితో అల్లరిచేయకూడదని చెప్పగా వీరు తగవుపెంచుకున్నారట. వీరెప్పటున్ను రైల్వేఅధికారులు వీరిని గౌరవంగా చూచినా వీరుమాత్రం రైల్వేఅధికారులతో అవమానకరంగా వ్యవహరింతురట. ఈవిషయాలను విచారించుటకై పైఅధికారులకు తెలిపినారు.

(హై. బు)

క్రాఫ్టుగారు

హైదరాబాదు[దక్కన్]పహారేవరుకెగ క్రాఫ్టు ఐ. సీ. యస్. రెవిన్యూ కార్యదర్శిగారు వరంగల్ కరీంనగరు జిల్లాలలో పర్యటనము చేయుచున్నారు. ఖాజీపేటనుండి వారు న. అమీర్ జంగుగారి జాగీరగు అమీనాబాదు వేంచేసిరి.

జోగలకు జోపండు నీకరటిపండు
నినుగన్నతల్లికి పాలరటిపండు
చిన్ని నాగోపాలా చెన్నదరిమొగ్గ.


నూతన రకములబట్టలు కావలెనా? రండి!
ధర భేదమున్నచో వాపసు తీసుకొనబడును
కైలాస వెంకన్నగారి శంకరయ్య
కింగ్స్ వే, సికింద్రాబాదు.

ఆటలలో ప్రవీణత అనగా
దృష్టియును దేహము
నందును, మెదడునందును
చురుకుదనము

ఆటలాడునపుడు నేత్రబాధకు గుర్తులేమనగా:-నీరుకారుట, మండుట, దురద, తలనొప్పి ఆయోమయము, వెలుతురును చూడలేకుండు, కోపము, చికాకు, అలసట, మత్తు మొదలైనవి.

ఇంగ్లాండు, అమెరికాదేశములలో వ్యాయామసంఘముల వైద్యసలహా సంఘములన్నియు, సూపర్ టారిక్, పుంకటాల్, మొస్కస్, మానోయువ్యయల్, బైఫోకల్, మరియు ట్రైఫోకల్ అద్దములు ఆటలకును, మోటారుకారు మరియు యితర యింజనులునడుపు వారలకును, వెలుపల ఆడు ఆటలన్నిటియందును, చాలసౌఖ్యమును కలుగజేయునని సలహాయిచ్చియున్నవి. ఎవరికైన బైకాన్వెక్సు, మరియు హై-కానకేవు అద్దములు మధ్య (16 డిగ్రీలు) దృష్టిని మాత్రమే యిచ్చునని పనికిరావని. కాని సూపర్-టారిక్, పుంకటాల్ మరియు మానోక్యియల్ అద్దములు, అద్దముల చివరవరకు (110 డిగ్రీలు) దృష్టినిచ్చును.

పగిలిపోనట్టి అద్దములు ఆటలాడువారికి చాల ఉపయోగకరములు. దెబ్బతగిలి, పగిలిన తునకలు కంటికితగులుటచే అపాయము వాటిల్లును.

నేత్రపరీక్ష రటినాస్కోప్ అను యంత్రసహాయమున చేయబడి, చీకటిగదిలో హైడ్రియాటిక్ తో అద్దము లిప్పలయును, యింగ్లండు, అమెరికాదేశములలో ప్రవీణులచే కోతకోయబడినవి రు. 10-0-0 లపై ఖరీదులో దొరకును. వాటినే ఉపయోగించవలయును.

మెనిస్కస్, వెంటిక్యులర్ (ఎక్కువ పవరుకు ప్రత్యేకమైన పలుచని అద్దములు) గులని. టోరిక్. ఫ్రంకటాల్ క్రిప్టాక్, అల్ట్రెక్సు, బైఫోకల్, ట్రైఫోకల్, మొదలైనవి హిందూదేశములో అసలుధరకు రెండంతలలో దొరకును. కాని అవి జర్మనీ, అమెరికాదేశములనుండి రు. 50-0-0లు అందుకు పైపెలలో అద్దములయొక్కయు, చట్టములయొక్కయు రకమునుబట్టి దొరకును.

వివరముల పుస్తకములు ఉచితముగా, ఉపాధ్యాయులకు, హకీములు, వ్యాయామోపాధ్యాయులు, డాక్టర్లు, నర్సులు, నేత్రరోగములచె బాధపడుచున్న రోగులకు యివ్వబడును

సలహా నేత్రవైద్యులు డా॥ కె. పి. పాపట్,
యల్. ఆర్. సి. ఎస్. ఓ.సి.
యస్. యమ్. యం (ఎడిం)

హార్డి అండు కో
సులోచన వ్యాపారులు-లండర్,
124 జేమ్సుస్ట్రీట్ -శికింద్రాబాదు.

Khan & Sons



అభివృద్ధి మార్గమున మరియొక కొత్తవిషయము

Godrej No. 1
Godrej No. 2
Godrej Turkish Bath
Vatni

గోద్రెజ్ కంపెని తమకుగల గొప్పసామర్థ్యము, జాతీయాభిమానములవలన నిరంతరము ముందుకుసాగుచు నూతనవికాసముల నందుచున్నది. నిరంతరపరిశోధన, కృషివలన గోద్రెజ్ నేడుమరియొక క్రొత్తసబ్బును సగర్వముగ నొసంగుచున్నది

Godrej
గోద్రెజ్
Vatni
వత్ని
(మాతృభూమియొక్క)
వనస్పతి టాయిలెట్ సబ్బులు

దానిపేరునకు తగినటుల నేయున్నది గొప్పవిజ్ఞానశాస్త్రజ్ఞులు, చర్మవ్యాధినిపుణులపరీక్షలకు నిలువగలిగి విఖ్యాతినొందిన గోద్రెజ్ పరిశుభ్రతననుసరించి తయారుచేయబడి, అసమానమైన జాతీయసబ్బు అయియున్నది

దేహసౌందర్యము, పరిశుభ్రత హిందూదేశవంశపారంపర్యపువాక్కు. చల్లని వృక్షద్రవ్యసహిత నూనెలు "వత్ని"లో చేరియున్నందున చర్మమునకు నూతనసౌందర్యము నొసంగును. దీని మృదువైన నురుగునందలి సువాసన చిట్టచివరకు మీ కానందము కలుగజేయును. నేడేమీరు ప్రథమపర్యాయము కొనితెచ్చిన యీశుభ్రమైనపెద్దబిళ్ళ ఏలాంటి కల్తీవస్తువులుచేరక నిత్యకృత్యపు సబ్బుగామారగలదు.

Godrej శుద్ధస్వదేశి PRODUCT

ఒక బిళ్ళ 3 అణాలు
అతిథులకు బహూకరించు బిళ్లలుగూడ గలవు.

గోద్రెజ్ సోప్స్ లిమిటెడ్
లాల్బాగ్, పరేల్ రోడ్డు - బొంబాయి.

స్వదేశీశాఖ సంబంధపు సువాసనసబ్బుల తయారుచేయు నిపుణులు. జంతువులక్రొవ్వు చేరలేదని శుభ్రత నూటికి 100 పంతులు పూచీ యొసంగబడును.

## సారస్వత సమితి

(స్వ వి.)

ఖమ్మంమెట్టు, షహరేవరు ౨౫

ఖమ్మంమెట్టులో హరికేన్ ఫండు విశ్వప్రయత్నములో జనాబు స్యానిటరీ ఇనస్పెక్టరుగారి కృషి చాలా ప్రశంసనీయము. ఈపురములో వర్తకులనుంచి పెద్దవారినుంచి చిన్నవారినుంచి దాదాపు ౩౦౦౦ వసూలుచేసియున్నారు, దీనిలో వర్తకదారులుకూడా ఇచ్చినవారే. ఇదిగాక నాటకమువిద్వకూడాసహాయము పొందబడినది యెవరో ఇంకా తెలియబడలేదుకానివాల్ పోస్టర్సు వేసియుండిరి. దానిలో యుద్ధనిధి ఇవ్వకూడదని యిం కౌ రుమే ను (వా సి రి. ఖమ్మం మా ల్కా గిర్దావరు జనాబు వహమ్మదు ఖాసీంసా॥ గారుకూడా శ్రమచేయుచు హరికేన్ ఫండును పైమొత్తము చేసిరి.

౨౭—౧౦—౪౯ తేదీ సాయంత్రము ౫గంటలకుమారు సారస్వతసమితి సంఘస్థాపన శ్రీయుత సర్వదేవభట్ల రామనాథం బి.ఏ. గారి అధ్యక్షతలో విద్యార్థిసంఘ గ్రంథాలయములో జరుపబడెను. ఉపన్యాసకులు ప్రేక్షకులుగూడా అసభయందు పాల్గొనిరి, ముఖ్యోద్దేశము, ఆంధ్ర భాషను వృద్ధిచేయుట జ్యోతిఅనే తెలుగుపత్రిక ఈపురములో దాదాపు ౧౪ సంవత్సరమునుంచి కృషిచేయుచు శ్రీయుత యల్లా ప్రగడకృష్ణమూర్తిగారి సంపాదకత్వమున నడుపబడుచున్నది పత్రికకు నిర్వహణప్రోత్సాహముచేసి కృషిసల్పుటకు ప్రబోధముచేయబడెను. తెలుగుభాష ప్రతివ్యక్తియును చాలాముఖ్యముగా నేర్చియుండవలయునని అధ్యక్షులవారు ప్రబోధించిరి, దినదినము తెలుగుతనేపదమే లేకపోవునేమోఅనియు ఈనైజాము రాష్ట్రమున ప్రతిఆంధ్రుడును తనమాతృభాషయగు తెలుగుతల్లినివదలి అన్యభాషయందు ప్రీతిచే గృహములోకూడ ఈభాషనువీడి ఉర్దూభాషనుమాట్లాడి ఉపయోగించు మన హైందవసోదరులకు హెచ్చరికచేసిరి. ఉపన్యాసవేదికలందుగూడ తెలుగుతోచెప్పవలెనియున్న సభలోయాంధ్రసోదరులకు భావరానందుకుక్షమాపణచెప్పుచూ ఉర్దూభాషలో ఉపన్యాసముచెప్పువారనుభావులు తెలుగుతల్లిని అవమానపరచిన

## సనాతనుల సంతకాల బేరము

సిద్దిపేట, షహరేవరు ౨౮

మొన్న సనాతనుల ప్రచారకమువద్దారగు మా గ్రామపు రోహిత మెట్టయ్యగారు, నావద్దికి వచ్చి "బాల్యవివాహనిషేధ" ప్రతిఘటనకై పల్లెటూళ్ళకుపెళ్లి సంతకములు గొనివచ్చెదవా? (౧౦౦) సంతకాలకు రెండణాల నాల్గుపైసాలు కమీషన్ యిచ్చుచున్నాము. నీకుగూడ యిదేకమీషన్ యిచ్చెదమని ప్రోత్సహించినాడు. పురోహితులవారికి యీకమీషన్ అస్సలు ఖరీదుయెంతనో? లాభమెంతనో? యింకను నాకు తెలుపలేదు పైసనాతనకేంద్ర సంఘమువారుయేకమీషను యిచ్చుచున్నారో? నాకుతెల్పిన బాగావుండునని నాఅభిప్రాయము

ద॥ జిలాఅంజయ్య
సిద్దిపేట

## శాసనము

పత్తిపురము, షహరేవరు ౨౫

ఈగ్రామం తుమ్మలకుంటవద్ద బహుదినములనుండి ఒకశాసనము మృతమైనరాతిని. పడియున్నది కాని దీని పరిశోధకులుకూడ పరిశీలించలేదు.యిందుకు కారణబహిర్గతం కాకపోవుటయే కాబట్టి పరిశోధకులు వచ్చి పరిశీలించినచో, విషయము తేటపడగలదని నాతలంపు.

ఇట్లు
హరుసూరి కోటగిరిరావు పత్తిపురం. తా॥ హుజూరునగరు, నల్లగొండజిల్లా.

## జీవరక్షాప్రచారము

సదాశివపేట జూలై ౨౧

దుర్గమాంబజాతర సందర్భములో నేడు ఇక్కడ జీవరక్షాప్రచారక మండలివారు పడమర అడవిబజారి లో సాయంత్రము ౭౻ గంటలవరకు హరికీర్తన చేయుచు జీవహింసధర్మముకాదని యెన్నియోవిధముల చెప్పిరి

౨౨-౭-౪౦ మరుపటిదినము ఉదయము నగరకీర్తన చేయుచుసాయంత్రము ౭ గంటలనుండి ౧౧గంటలవరకు ఆదేబజారులో కీర్తన.మ్యాజిక్ లాంతర్ ద్వార పశువుల ఉపకారములచెప్పుచు, వాటినిహింసించుట బుద్ధిమంతము కాదని చెప్పిరి. ౨౩-౭-౪౦ ఉదయమునగర కీర్తన చేసిరి. ఇక్కడిగ్రామాధికారులు ప్రజలు వారిని మన్నించి ఆదరించిరి.

ఇట్లు
మంత్రి ఆర్యసమాజ్

## కలరా

(ఒక విలేఖరి)　పెద్దేముల్, షహరేవరు ౨౭

ఈగ్రామం చించోలి తాలూకాలోచేరినది, జనసంఖ్య ౨౦౦౦ కు పైగలదు పారిశుద్ధ్యమూ బొత్తిగాలేదు. వీధులలో దుర్గంధ మరియు దోమలనుండి జనులు మలేరియా జ్వరపీడితులగుచున్నారు. గ్రామములోనే చెత్తవేసి పెంటలుచేసుకున్నారు. కలరావ్యాధి ప్రారంభమైమాసము కావచ్చెను. గుల్బర్గానుండి డాక్టరుగారువచ్చి గ్రామజనులకు యింజక్షన్ కలరానివారణకై యిచ్చి బావులలో మందుపోసి వెడలిపోయినారు. లోగా యెల్లప్పుడు యిక్కడ హెల్తు ఆఫీసర్ ఉండెను. కాని యేమికారణముచేతనో యిక్కడినుండి తీసివేసినారు,

రోడ్డు

ఇక్కడినుండి తాండూరు మరికోటపల్లికిపూర్వము సర్కారువారి కచ్చారోడ్డు ఉండెను కాని శ్రద్ధలేనందున చెడిపోయినది అట్టిపడకు జ్ఞాపకార్థం కొన్నిస్థలాలలోకల్వర్టు లకలవు ఇట్టి వర్షకాలంలో బండియెడ్లుబొత్తిగానడువజాలవు.

ఈగ్రామమునుండి మరియు యితరగ్రామాలనుండి రైలుప్రయాణానికి రుక్మాపూరు స్టేషన్ రెండుసంవత్సరములనుండి వక్కబండి ఆపబడుచున్నది కారణంయేమో తెలియదు. దీనినుండి వ్యాపారస్థులకు, ఉద్యోగులకు గుల్బర్గా హైద్రాబాదు వెళ్లవలెనంటె చాలకష్టం. రైల్వేకంపెనీవారు బీదలయందు దయగలవారై మరిఒకబండి అనగా నెం అప్ సాయంత్రం నెర డౌను పగటిబండ్లు ఆపవలసిన యేర్పాటు చేయగలరు.

కలరావిషయంలో గ్రామస్థులు అందరు అందాజా ఒకవంద రూపాయీలు చందా ప్రోగుచేసి, దేవతకు పశుబలి చేయుచున్నారు.

యుద్ధనిధి

చించోలినుండి తహసీలుదారు గారువచ్చి యుద్ధ సహాయార్థము యీగ్రామములో సాహుకార్లను రైతులను పిలిచి సభజరిపిరి. ౧౬౦ రూపాయిలు వసూలుఅయెను.

మీబిడ్డలను ఆరోగ్యముగా యుంచుటకు
ఇక్ ఫాక్ టోక్ పాడుడు.
★ ★ ★
ఇక్ ఫాక్ టోక్
మాన్యుఫాక్చరింగ్ కంపెని
హైదరాబాదు-దక్కన్.
మందుల దుకాణము లన్నిటియందు అమ్మబడును.
Khan & sons

SAHARA
ONLY GENUINE WITH THIS
TRADE MARK
CHEAP
MADE IN U.S.A.
SAHARA
CHEAP
5 అణాలకు 10

భగవాన్ లాల్ నారాయన్ జీ
అత్తరు వ్యాపారులు.
ఉస్మాన్ బజారు హైద్రాబాదు.
మావద్ద అన్నివిధములైన స్వదేశ అత్తరు తైలములు అగరుబత్తీలు, కుంకుమపువ్వు, చాయ డబ్బీలు, జర్ద మొదలగునవి అమ్మబడును.

శ్రీ మాళవ్యా జీ
కాయసిద్ధిరసాయనము
దీర్ఘరోగములనన్నిటిని బోగొట్టును

స్త్రీలకు, బాలురకు, వయస్సువారలకు, వృద్ధులకు వచ్చెడి ఈరోగము ఆరోగమనకుండ అన్నివ్యాధులను ఇంగ్లీషుమందులకు, ఇంజక్షనులకు, ఆప్రేషన్ లకు, ఎలెక్ట్రో (బిజలీ) ట్రీటుమెంటులకు, కుదరక ప్రాణము విసిగినటువంటి దీర్ఘబంధ మొండివ్యాధుల నన్నిటిని మరల చిగర్చకుండ కృంగటి త్రేళ్లతో పాతమార్చుటకు గండ్రగొడ్డలివంటిది. రంకురోగముల చేగాని, ఇతర రోగములచేగాని చిరకాలమునుంచియున్న మేహాషికాయతులవల్లగాని కృశించిపోయిన కష్టైమనిషిని ఉక్కుమనిషినిగా, వజ్రశరీరునిగ జేయును. ఈశ్వర సాక్షాత్కారసిద్ధిని, అణిమాద్యష్టసిద్ధులను బొందినటువంటి "సిద్ధనాగార్జునుడు" యజ్జరావ్యాధి విధ్వంసీ, వయస్తంభకరంతథా, చక్షుష్యం బృహణంవృష్యం కాయసిద్ధిరసాయనం. యని ఘంటాపథముగా జెప్పుటచే యెటువంటి వైద్యులకు, డాక్టర్లకు లొంగని ఎంతదుర్ఘటమైన దీర్ఘవ్యాధినైనను బోగొట్టి ముదిమిని రానీయకుండి గాపాడి వయఃస్తంభనము (యౌవ్వనము) గలిగించి నేత్రములకు దృష్టిదోషమును రానీయక శరీరమునకు బలము, పుష్టి కాంతి, జ్ఞాపకశక్తి, నరములకు పటుత్వముగల్గించి వృద్ధత్వములోగూడ సంతానమును గలిగించునట్టి వీర్యపటుత్వము, అంగపటుత్వము గల్గించుటయేగాక "షట్త్రింశతంసహస్రాణీ రాత్రీణాం శీవయేనరః" యనగా 36000 అహోరాత్రములు నూరు సం॥రములవరకు దీర్ఘాయుష్మంతులగ జేసి యదేచ్ఛగా ఐహికాముష్మిక సుఖంబుల నొందింపజేయుటకు జగత్ప్రసిద్ధిమైనమందు.

1 మండలం మందు:-12-0-0 పి.పి. 0-8-0 జవాబుబిళ్లలు పంపవలెను. రోగవివరములు వ్రాయండి.

డాక్టర్ రత్నం అండ్ సన్సు మెడికల్ హాల్ 252 బి. మలకపేట, హైద్రాబాదు-దక్కన్.

ముఖ్యముగు స్నేహితులందరికి సంతోష కారణము
నిజమయిన టీ ప్రేమించువాళ్లు
స్నేహితులందరు కలసినప్పుడు, సంభాషణ తగు వినోదకరముగానుండవలెనన్న, టీ తప్ప వేరు పానీయమే లేదు. స్నేహితులకు చక్కని టీ ఎప్పుడిచ్చినను పుచ్చుకొని సంతోషించెదరు.

హిందూదేశపు టీ
తప్పక త్రాగవలెను

టీ చేయు క్రమము:—శుద్ధమైన వేడినీరు. కొంచము వేడిచేసిన శుద్ధమైనపాత్ర. ఒకస్పూన్ టీ యొక్కొక్కరికిన్ని, మొత్తముగా నొక స్పూన్ యధికముగాను పాత్రలోవేసి, బాగుగా మరుగుచున్న నీటిని పోయవలెను. 5 నిమిషములు తాళి గిన్నెలలోపోసి పాలు చక్కెర చేర్చవలెను.

ఇండియన్ టీ మార్కెట్ ఎక్స్పాన్షన్ బోర్డువారిచే ప్రకటింపబడినది, 1K 113

ఇండియా తేయాకుల్లో శ్రేష్ఠములు
LIPTONS WHITE LABEL TEA
LIPTON'S TEA GIRL
LIPTON'S
లిప్టన్ వారి వైట్ లేబిల్, టీగరల్, జాకూటీజాలు
LTM 19 S1

వుసిరిక లేహ్యము, చవనప్రాశావలేహ్యము, గులకందు, గులాబు శర్బతులు
శిలాప్రవంగము
(Silapravanga)
అన్ని విధములైన భస్మములు, రసాయనములు, మాత్రలు, చూర్ణములు, ఆసవారిష్టములుకలిగి అందరిచే ఆదరించబడిన కంపెనీ
శ్రీధూత పాపేశ్వర పెన్వెల్ (లిమిటెడ్)
నోటు:-ఒకేసారి తీసుకొనదలచినవారు మా ఏజన్సీతీసుకొనదలచినవారు హెడ్డాఫీసులో కలుసుకొనవచ్చును.
హెడ్డాఫీసు:—హరిపంత్ పన్ లేకర్ దవాఖానా
194 సుల్తాన్ బజారు, మార్కెట్టుసమీపమున, హైదరాబాదు-దక్కన్
బ్రాంచీలు.—గుజరాత్ జనరల్ స్టోర్, జనాన్మరుపీడుయెదుట, సికింద్రాబాదు.

తామెప్పుడైన హైద్రాబాదునకువేంచేసినచో నాంపల్లి రాయల్ హోటల్ను మరువకుడు
[ఫోన్ నెం. ౩౪౬౭] అక్కడ ఉత్తమమైన ఏర్పాట్లుగలవు.
Khan and sons.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర శ్రావణ శు॥ ౯

సోమవారము


## కీ. శే. మైసూరు మహారాజుగారు

ఎందరో రాజులు, మహారాజులు, మరి అట్టివారు చనిపోవుచుందురు. కాని అందరికొరకును అందరును అంగలార్చరు. గత వారము మైసూరు మహారాజులుంగారు చిన్న వయస్సులోనే చనిపోయినందున భారతదేశమందలి అన్నిప్రాంతాలలోను అన్నిశాఖలవారైన రాజులు, రైతులు, హిందువులు, మునల్మానులు, క్రైస్తవులు, ఇంగ్లీషువారును తమ సంతాపాన్ని వెల్లడిచ్చినారు. కాంగ్రెసు నాయకులు కూడా వ్యసనపడినారంటే దానిలో చాలామంచి అర్థమున్నది.

మైసూరు మహారాజాగారగు శ్రీమంతు మహారాజా కృష్ణరాజ ఒడయర్ బహద్దరుగారు తమ ౫౭వ ఏట చనిపోయినారు. ఈ వయస్సు అంతగా మునలితనాన్ని తెలుపునట్టిదిగాదు. అయినా దైవవిధి అనుల్లంఘనీయము. ఇంత ప్రీతిపాత్రులగుటలో ఈమహారాజుగారిలోని విశేషములెవ్వి? వీరు సనాతనులు. సనాతన అను పదానికి పూర్వకాలంలో ఉత్తమార్థముండెడిది. ఇప్పుడు పూర్వాచారములంగు మంది పట్టింపు కలవారికే ఈ పదము వర్తించునట్లుగా హిందువులలో కొందరు ఈ పదాన్ని ఏర్పాటుచేసుకున్నారు మైసూరు మహారాజుగారికి అంటు ముట్టు పట్టింపు, కులకట్టుబాట్లు, భోజన దృష్టిదోషము, స్పర్శదోషాదులను పాటించుట, ఇట్టి ఆచారాలు విశేషముగానుండెను.

అట్లున్నను వారు సర్వజనప్రియులైరి. కారణమేమనగా వారు తమప్రజలను నిజముగా ప్రేమించిరి సాంప్రదాయ పద్ధతిగా రోకటిపాటగా ప్రపంచములో వాడబడు కొన్ని పదాలకు అర్థములేకుండా అయిపోయినది "ప్రియమైన" అను పదమట్టి శబ్దజాలములో చేరినట్టిది. కాని మైసూరు మహారాజు తమ ప్రజలను, ప్రజలు తమమహారాజును పరస్పరం నిజముగా ప్రేమించుకొనినట్టివారు. విదురాశ్వత్థంలో తుపాకీలతో పోలీసులు ప్రజలను కాల్చిరి. ఏయిశ్వర మహారాజైన అయిఉంటే దానిని తననిద్రతోనే మరచిపోయియుండును. ఒక సిమ్లాగుట్టలలోని రాజు తన ప్రజలను తనచేతితో తన తుపాకితో గురిపెట్టికాల్చెనను వార్తలను కొన్ని మాసాలక్రిందట వింటిమికదా! ఒకఒరిస్సా సంస్థానములో వేనవేలు ప్రజలు ప్రక్కరాజ్యంలోనికి వలసపోయి నానాక్లేశములనుభవించినదికూడా వింటిమిగదా కొన్ని రాజ్యాలలో జరుగు అత్యాచారాల విచారణలు కమిషనుల ద్వారా చేయవలసినదంటే చేయకపోయిరి కాని మైసూరుమహారాజుగారు వెంటనే విచారణను ఏర్పాటుచేయించిరి. కాంగ్రెసు వర్గనాయకులైన సర్దార్ పటేల్‌గారిని పిలిపించి ప్రజలను సమాధానపెట్టిరి

ఈ మహారాజుగారికాలంలోనే శాసనసభలలో ప్రజలకు పలుకుబడి మె క్కువగా ఇయ్యబడినది. ఈ సన్నివేశము మరే దేశీయసంస్థానములోను లేదని ఘంటాఘోషముగా చెప్పగలము ఇట్టి కారణాలచేతనే కాబోలు మహాత్మాగాంధీగారుకూడ మైసూరులో రామరాజ్యం ఉన్నదని ప్రశంసించిరి. అనగా అది మహారాజుగారియొక్క వ్యక్తిగతమగు ప్రశంసఅని తలపవలెను

మైసూరులో రాజ్యాభివృద్ధిఅపారముగా జరిగినది. పరిశ్రమల అభివృద్ధి మెచ్చుకొనదగినటిది. దీనికికారణం మైసూరుమహారాజుగారు వరుసగా ఏర్పాటుచేసిన మంత్రుల పరంపర. ఒకప్రభువు తన మంత్రిని మంచివాని నేర్పాటుచేసి కీర్తి పొందును. ఇంకొక ప్రభువు దద్దమ్మను స్వార్థని ఏర్పాటుచేసి అపకీర్తి పొందును. ఇది చారిత్రికగుణపాఠము. వరుసగా శేషాద్రి, సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య, సర్ ఇస్మాయిల్ గారు మున్నగు మంత్రులు ఏర్పాటైరంటే అది మహారాజుగారి దూరదృష్టికి నిదర్శనము ఈమంత్రులు రాజబంధువులుకారు. నవాబుల సిల్సిలావారుకారు కోటీశ్వరుల పిల్లలుకారు. సాధారణస్థితినుండి ఆ యున్నతపదవికి వచ్చినట్టి మహాశక్తిమంతులు. ఎచ్చటనైతే దరిద్రులకు కూడా మంత్రిపదవిపొందే అవకాశముండునో అక్కడ రాజ్యాంగపద్ధతి మంచి స్థాయిలోనున్నదనవలెను అందు లోపాలుండవచ్చును. లోపాలులేనివారును, సంస్థానాలును, రాజ్యాలును లేవు. వీలైనంతవరకు ఉత్తమత్వమును ప్రచారముందుంచువారే గణనకు వత్తురు. మైసూరులో యెన్నియో వాండుగుణములనగు శాసనములు అందు ముఖ్యముగా స్త్రీలకు సంబంధించిన ఉత్తమశాసనాలు కావింపబడినవి రాజు కలిగితే ఏమి కొదువ?

ఈ కారణాలచేత మైసూరుమహారాజులుంగారి అకాల మరణమునకు మేము మా సంతాపమును వెలిబుచ్చుచున్నాము వారి యాత్మకు శాంతి, వారి ప్రజకు భావ్యభివృద్ధి, వారిస్థానములో పరిపాలకులుగా నున్నవారికి పూర్వపు మహారాజ గారివలె మహాదార్యము ప్రజానురంజనము, కలుగవలెనని ప్రార్థించుచున్నాము

— —

## ఉద్యోగాలకమిటీ

హైదరాబాదు(దక్కన్) షహరేవరు౧౦

క్రొత్తవిన్యాసిన, నిరుద్యోగి శాఖకును కార్యకర్తిగానున్న వారిచ్చిన సలహాప్రకారము ఒక ఉద్యోగకమిటీ ఏర్పాటైనది ఇకముందు ప్రభుత్వోద్యోగాలను గాను నేరుగా రిక్రూటుమెంటు చేయకు ఉమీద్వారులనుకూడా తీసుకోరు, అన్నింటితో తమపేరులను పై నిరుద్యోగాదిశాఖా కార్యదర్శి గారలకడ్డ వ్రాయించుకొని ...శాఖలకెవరు కావలెనో ఈకమి... నిర్ణయించిపంపును

(హై బులెటిన్)

— —

## గాలసేనానితో బ్రిటిషుప్రభుత్వపు ఒడంబడిక

### బ్రిటిషువారికిరింద ఫ్రెంచిసేనల వ్యవస్థ

లండను అగస్టు ౭

చర్చిలుగారికిని డీగాల్ సేనానికిని కుదిరిన ఒడంబడిక అగస్టు ౭వతేదిరాత్రి ప్రకటింపబడినది

ఒప్పందము వివరములు

ఈ ఒడంబడిక ౧—౭—౧౯౪౦ నుండి ఆచరణలోనుండును డీగల్ సేనానితయారుచేయుచున్న ఫ్రెంచివలంటీరుసైన్యదళము సాధ్యమైనంతవరకు సైనికవిషయముల ముఖ్యముగా క్రమశిక్షణ, భాష, పదవులలో ప్రమోషను, కర్తవ్యములు— వీటిలో ఫ్రెంచిసైన్యమువలెనే ఉండును సాధ్యమైనంత త్వరగా ఆదళమునకు అట్టి బ్రిటిషుదళము లవండు సాధనసంపత్తునంతయు బ్రిటిషుప్రభుత్వము సరఫరాచేయును ఆయుధములు, విమానములు, మందుసామగ్రి వారిసన్నాహము పూర్తియగుటకుగాను ముందువారికి ఇవ్వబడును ఫ్రెంచి నౌకాదళమునకు చెందిన నావలను సాధ్యమైనంత ఎక్కువగా వినియోగించుటకుగాను వాటిని ఎక్కడ ఉంచవలెనో అవిక్రయమున జాగ్రత్తగా ఏర్పాట్లు చేయబడినవి ఫ్రెంచివారు తమమనుష్యులతో నడపగలన్ని యుద్ధనావలను తామే నడుపుదురు తక్కినవి వేరుగా బ్రిటిషుఆధీనములోనుండును కొన్ని ఇతరమిత్రమండలి నౌకాదళముల క్రింద పనిచేయును సాధ్యమైనప్పుడు బ్రిటిషు అధికారవర్గములో ఫ్రెంచిఉద్యోగులు సామాన్యసిబ్బందిని కొంత దామాషాన నియమింతురు డీగాల్ సేనాని బ్రిటిషు నౌకాశాఖవారు కలిసి సంప్రతించుచు నావలను ఎక్కడ ఎట్లు ఉపయోగించవలసినది నిర్ణయింతురు ఫ్రెంచివర్తకనావలను, నావికుల సైనిక వ్యవహారములందు ఉపయోగించుటనుగురించి కూడ గాలిసేనాని, అయూబ్రిటిషుప్రభుత్వశాఖలు కలసి యేర్పాటు చేయుదురు

ఒప్పందము ప్రకారము, గాలిసేనాని బ్రిటిషు హైకమాండువారి సామాన్యాధికారమునకు లోబడియుండవలెను ఫ్రెంచిసైన్యమును ఎప్పుడుగాని ఫ్రాన్సుపై కత్తిదూయవలెనని కోరగూడదు ఆవేసరతను లోబడి అవసరమువచ్చినప్పుడు ఆ ఫ్రెంచిసైన్యంలో ఏభాగపు ప్రత్యేకాధికారము సైనాడీగాల్ సేనాని బ్రిటిషు ఉద్యోగులకు అప్పజెప్పుననిగూడ ఒడంబడికలోనున్నది

వలంటీర్లకు సౌకర్యము

కాంతి ఏర్పడినతర్వాత, ఫ్రెంచివాలంటీర్లు తమ హక్కులు, జాతీయ ప్రలపత్తు తిరిగి సంపాదించుకొనుటకు సహాయపడెదనని బ్రిటను మాట యిచ్చుచున్నది ఈలోగా వాలంటీర్లు బ్రిటిషు జాతీయత పొందుటకుగాను ప్రత్యేక సౌకర్యాలు ఇచ్చుటకు బ్రిటను సిద్ధముగానున్నది,

సొమ్ము అప్పుగా ఇవ్వబడును

ఫ్రెంచి సైన్యముచేర్చి, పోషించుటకుగాను ఖర్చును మొదట బ్రిటను భరించును ఇది అప్పుగా ఇయ్యబడినదిగా ఎంచి, ప్రత్యేకముగా లెక్కపెట్టబడును.

— —

## హైదరాబాదు హారికేన్ ఫండు

ప్రభుత్వ ప్రకటనశాఖవారిట్లు తెలుపుచున్నారు

తమ గొప్పప్రభువు ననుకరించుచు ప్రజలందరును సైనిధిక అపూర్వమైన సహాయము చేసినారు సైనిధిక ౩ లక్షలేకావలెననికోరగా ఇప్పుడు నాలుగున్నరలక్షల కల్దారురూపాయిలు వసూలైనవి పైగా న సాలార్జంగుగారు ఒక యుద్ధవిమానాన్ని తామొక్కరే యిత్తునన్నారు జాగీర్దారులు ఉదారముగా సాయము చేయుచున్నారు నవాబు కమాల్‌యార్జంగుగారొక్కరే ౫౦ వేలచందానిచ్చినారు

— —

## స్టేటు బెంకు

హైదరాబాదు[దక్కన్] షహరేవరు౩

హైద్రాబాదు స్టేటుబెంకును స్థాపించుటకు ప్రభుత్వమువారు అంగీకారమిచ్చినారు మద్రాసులోని ఇంపీరియల్ బెంకులోనుండి అర్. యస్. పేటన్ అనువారిని యీ బెంకును సరియైన విధములో స్థాపించుటకై ఫర్మానుద్వారా ఏర్పాటుచేసినారు ఈక్రొత్తఉద్యోగికి నెలకు ౪౦౦౦ కల్దారుల జీతమిత్తురు మూడేండ్లకుగాను ఉద్యోగమిచ్చినారు

— —

## బాల్యవివాహ శాసనము

హైదరాబాదు దక్కన్, మెహరుకి

బుధవారమునాడు హైద్రాబాదు బేగంబజారులో మార్వాడీమండలివారు బాల్యవివాహ నిషేధమునుగూర్చి ఒకసభచేసిరి సభకు సికింద్రాబాదు సనాతనులు ఎక్కువగా వచ్చిరి ఒక సనాతని మాట్లాడుచు తనకు అనుకూల వాతావరణము లేదని భావించి సనాతనులందరు సభవదలిపోవలసినదని చెప్పెను అప్పటినుండి అల్లరిప్రారంభమయ్యెను కాశీనాథరావువైద్యా, యం నరసింగరావుగార్లు చిత్తుశాసనానికి అనుకూలముగా మాట్లాడిరి, ఓట్లు తీసుకొనునప్పుడు ఓట్లకు అనుకూలుర వోట్లను లెక్కపెట్టుటకు ఒక సనాతనునిన్ని, ప్రతికూలుర లెక్కపెట్టుకొనుటకు ఒక్కసంస్కరణవాదిని అధ్యక్షులైన సేటునారాయణలాల్ బన్సీలాలుగారు ఏర్పాటుచేసిరి, అయితే సనాతనిఓట్లచ్చినవారిని ఇంటికి పంపవేసను మళ్లీ సభముగిసిన చూపిబోతే ఇ ... సహాలనివ .. మిగిలియుండిరి సభకూడ రాత్రి పదకొండున్నర గంటలవరకు జరిగెను,

— —

## రవీంద్రునకు ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయ సమ్మానము

### డాక్టర్ ఆఫ్ లిటరేచరు బిరుదప్రదానము

శాంతినికేతనము, అగస్టు౭

"మానవస్వాతంత్ర్యము లయందు ఆవేదన హెచ్చుచు ఉన్నతగుణములు సంయమనకైనను గానరాని ఈసమయమున దేశములఖండములను ఉత్పాతములు పైకొనుచున్న ఈ సమయమున శాస్త్ర పరిశోధనలచే నుద్దీపితమైన రాక్షసత్వము రాజ్యకాంక్ష యథేచ్ఛగా తాండవించుచున్న ఈసమయమున మానవసౌభ్రాతృత్వము విషయమై మాట్లాడుట కేవలము కవికల్పనలవలె నగిపడవచ్చును కాని ప్రస్తుతకాల మెంత దౌర్జన్యయుతముగానున్నను ఇయ్యది తాత్కాలికమే ఈరోజులు దాటిపోయినతరువాత అనంతకాలములో నివసించు మనము నాగరికత నిరంతరాయముగా వర్ధిల్లి వృద్ధియై మానవపరమావధి చేరబడునను నమ్మకముతోనుండవలెను" అని ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమువారు సమర్పించిన వినతిపత్రమునకు ప్రత్యుత్తరమొసంగుచు డా॥ రవీంద్రనాథ ఠాకూరుగారుచెప్పిరి ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమువారు కవికి డాక్టర్ ఆఫ్ లిటరేచర్ అను గౌరవబిరుద మొసంగుచు దానితోపాటు ల్యాటిన్ భాషలో వినతిపత్రము సమర్పించిరి రవీంద్రుడును దేవభాషలో ప్రత్యుత్తరమొసంగను కలకత్తా హైకోర్టు న్యాయమూర్తి హెండర్సనుగారు వినతిపత్రము చదివిరి భారతదేశ ప్రధానన్యాయమూర్తి సర్ మారిస్‌గ్వయరుగారు చిన్నఉపన్యాసము గావించుచు ఆక్సుఫర్డువిశ్వవిద్యాలయముపక్షమున కవిచంద్రునికి పట్టముప్రసాదించిరి. పట్టప్రధాన మహోత్సవమునకు సర్ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు, జె. యం. బాటమలీగారు, విద్యాశాఖాప్రధానాధికారి డా॥ శ్యామప్రసాద ముఖర్జీగారు వచ్చియుండిరి

ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయప్రతినిధుల సద్దేశం ...చి డా॥ ఠాగూరుగారిట్లు చెప్పిరి —

"భారతదేశకవినగు నన్ను సత్కరించుటలో మీప్రాచీనవిద్యాపీఠముతన ఉదారఉన్నతసంప్రదాయములను ప్రకటించియున్నది ... మీరు యిట్టిసాంప్రదాయము ననుసరించుట కడుంగడు అర్థవంతమైనపని. మహత్తరమైన మా నవసంప్రదాయమున కడుచిహ్నమగుటచే, దానిసందేశమును నేనుగ్రహించుచున్నాను. మిమ్ములను శాంతినికేతనమునకు ఆహ్వానించుచున్నాను. ప్రేమపూర్వకముగా నాకును, నాదేశమునకును మీరుగొనితెచ్చినపట్టము మా హృదయములలో నెలకొని నాగరికతాభివృద్ధికై అందరము కలిసి పనిచేయునట్లుచేయగలదు ఆక్సుఫర్డువిశ్వవిద్యాలయమువారిచ్చిన ఈపట్టమువలన నొకనూతనయుగము ప్రారంభమగునని నేను తలచుచున్నాను అంతిమగమునేను బ్రతుకకపోయినను స్నేహపూర్వకముగా మీరిచ్చినపట్టమువలన ముందుయిప్పటికంటె మంచిరోజులు వచ్చునని తప్పక చెప్పవచ్చును"

— —


## కావలయును

నిజాంరాష్ట్రమునందు మా కంపెనీలో పనిచేయుటకై ఏజంట్లు మరియు ప్రతినిధులు కావలయును ఉదారమైనపద్ధతులు. చేరినవారికి మొదలు ప్రత్యేకముగా పని నేర్పబడును వివరములు ... తెలుసుకొనుడు

ఏ. కే. హారవు యూనిట్ ఆర్గనైజరు

... లైఫ్ ఇన్సూరెన్సుకంపెనీ (ఆఫ్ కనడా)

2095 ... స్ట్రీట్, సికంద్రాబాదు

Kh... & Sons

## గోలకొండ డైరీ

### అంతా తెలుగులోనే

హైద్రాబాదులోని ఆంధ్రులకు సర్వవిధాలా పనికివచ్చే తెలుగు డైరీని ౧౯౪౧ దినాలలో ముద్రించుచున్నాము —మొన్నాసైజులో డైరీ ఉండును. సుమారు ౧౫౦ పుటలలో అనేకవిషయాలు అనగా రాష్ట్రచరిత్ర, సుంకములు, టపా, రివిన్యూ, పరీక్షల స్కేళ్లు, ముఖ్యమైన స్థానాలు, జిల్లా తాలూకాలవివరాలు, వైద్య, రాజ్యాంగాలు, ఇంచుమించు అన్ని విషయాలు అందుంటును

మరి ౩౬౫ దినాలకు ౩౬౫ పుటలు ప్రత్యేకించబడును పంచాంగముకూడా ఉండును ఫసలీ, ఇంగ్లీషు, తెనుగు, హిజరీ తేదీలుండును వకీళ్లకు ... ఆఫీసులలో పనిచేయువారికి, వ్యవహారస్థులకు, ... వర్తకులకు, ... దారులకు. అందరికీ పనికివచ్చును. వేరేడైరీలు ఆంధ్రులెవరును కొనవద్దండి

వెల చాలా సరసము

గోలకొండ పత్రికాలయము

# ఇష్టాగోష్ఠి

—— అంగీరసుడు

## కాంగ్రెసు — ముస్లింలీగు

గాంధిగారి రాజకీయవిధానములో చాల అసందర్భములున్నవి. ౧౯౧౯నుండి ౧౯౩౦వరకు అపుస్కారము భారతవర్షమును రెండుమూడువందల సంవత్సరములు ముందుకుతీసికొనివెళ్లెను, ఆ పండ్రెండు సంవత్సరములలోను దేశీయులలో కలిగినరాజకీయ ప్రబోధము వర్ణనాతీతము ౧౯౩౦ అనంతరము గాంధికి స్వతంత్రమైన రాజకీయ కార్యక్రమములేదు శాసనసభా పునఃప్రవేశము కార్యక్రమము కాదాయనిన అది గాంధిగారికి యిష్టమైనది కాదు. అనేకమందలసార్లు శాసనసభాప్రవేశము నిష్ప్రయోజనమైనదని గాంధి వచించియుండెను. ౧౯౨౨-౨౩ప్రాంతములో చిత్తరంజనదాసు శాసనసభావిధానమును ప్రతిపాదించుచు స్వరాజ్యపార్టీ లేవతీయగా అప్పుడు గాంధిఅయన అనుచరులు దానుమీద ఏంతో తీవ్రమైనప్రతిఘటన సాగించిరి. అప్పుడు రాజగోపాలాచారిగారు శాసనసభలను ఖండించినవిధము ఆయనఉపన్యాసములు ఒకపెద్దగ్రంధమగును. ఈరోజున రాజాజీ శాసనసభా కార్యక్రమమునకైపడుచున్న అందోళన చెప్పగల రాదు. మంత్రివర్గముల సెందుకు రాజీనామానిచ్చితిమా యని కుందుచున్నట్లున్నది. "మేము మూడునెలలువిశ్రాంతి (హాలిడే) తీసికొంటిమి"—యిట్లాంటి రాజాజీవచనాలు వందలుగా కేవలఅధికారవాంఛను దెలుపుచూ ప్రకటింపబడినవి. తనతర్వాత నాయకుడు రాజాజీ అని గాంధి వ్రాయుచుండును.

సంవత్సరమునకు పూర్వము యు పి, బీహారు మంత్రివర్గములు రాజకీయఖైదీలను వదలకున్న రాజీనిచ్చెదమని బెదరింపగా బ్రిటిషు ప్రభుత్వము లొంగిపోయి ఆకాంగ్రెసుమంత్రివర్గముల యిష్టానుసారముగ ఖైదీలనువదలుటకు సమ్మతించిరి ఆరీతిగిధముల కాంగ్రెసుమంత్రివర్గములను రాజీనివ్వగానే (యుద్ధప్రకటనైనతర్వాత) బ్రిటిషువారు కాంగ్రెసునుప్రాధేయపడితీరెదరని పెద్దపెద్ద నాయకులుకూడ భ్రమనొందిరి మొదట్లో బ్రిటిషువారు జంకు చూపినట్లుండెనుగాని గాంధీగారి విధానముకల్లనే ఇండియాకార్యదర్శి తనపట్టువదలనవసరము లేదు కాంగ్రెసుకార్యసంఘము రాష్ట్రసంఘములు సత్యాగ్రహశిబిరములను ఏర్పాటుచేయించి శాంతిసైన్యములను తయారుచేయుచుండుట గాంధిగారు ఇంతలో సత్యాగ్రహములేదు" "బ్రిటిషువారు మధ్యయుద్ధరంగములో నుండగా సత్యాగ్రహముజరుపను" యిట్టివ్రాతలను హరిజనపత్రికలో ప్రచురించెను. రాజాజీ "ఛాంబర్లేను గారు అవతారమూర్తి"యని వర్ణనలుగావించుట (పార్లమెంటుసభ్యులు ఛాంబర్లేనుగారి నాక్షేపించిరి), జవహర్లాలు పండితుడుకూడ సత్యాగ్రహము యిప్పుడుకూడదనుట జరిగెను, కాంగ్రెసుసంఘాల తీర్మానములకును నాయకుల ప్రకటనలకును ఏమీసంబంధములేకపోవుట తటస్థించెను,

ఇదియిట్లుండ రాజ్యతంత్రములోఆరితేరిన బ్రిటిషుప్రభుత్వమువా రూరకుందురా? తమలోటు ఏదీలేనట్లు తమాషాలు చేయుచుందురు. "హిందువులు ముసల్మానులు మీలోమీరు సమాధానపడండి. మేముమీకు "అధినివేశ స్వాతంత్ర్యము" నిచ్చుయత్నములోనుందుము. మైనారటీల హక్కులనుగురించి మేము మరచిపోము"అని ఏ జట్లండుగారోలేక ఏతిమెరీగారో వచింతురు, ఇట్లా ఉండగా వైస్రాయిగారు గాంధిజిన్నాలనుపిలచి మాట్లాడుచుండుట గాంధినిపిలుచుట కాంగ్రెసు అభిప్రాయముకొరకు జిన్నానుపిలుచుట ముస్లింలీగు అభిప్రాయముకొరకు, ఇంక హిందూ మహాసభాభిప్రాయమేది? ఎప్పుడో నూటికొక్కసారి సావర్కరును పిలచుచుండును. తరచుగా గాంధి జిన్నాలకే ఆహ్వానమువచ్చుచుండును. వైస్రాయితోమాటలైనతర్వాత గాంధి నిరుత్సాహియై వచ్చుచుండుట పరిపాటైనది దీనికి కారణములు ఒకటి బ్రిటిషుప్రభుత్వవిధానములో కాంగ్రెసు కోర్కెలనురిపూంచు యుద్దేశములేదు. రెండు జిన్నాకాంగ్రెసుతో రాజీపడడు. రెండుసంవత్సరములక్రితము ముస్లింలీగు "కులతత్వసభ"—ఆలీగుతో కాంగ్రెసు రాజీకై మాట్లాడదన్న కాంగ్రెసునాయకులు మాటిమాటికి జిన్నా వెనుక పరిగెత్తుచుండుట చాలఆశ్చర్యము. ఇండియాకార్యదర్శి కాంగ్రెసునాయకులను తమాషాగాడించునట్లాడించుచువ్వా డనుకోవలెను ముస్లింలీగుతో రాజీకొరకై జిన్నా వెనుకతిరుగు గాంధీవిధానము నిజముగా ఆక్షేపింపదగినదే, కాంగ్రెసును హిందూసంస్థయని జిన్నావందలాదిసార్లు ప్రవచించెను అట్లన్ననూజిన్నాతో రాజీకొరకే ఉబలాటము. కాంగ్రెసుజాతీయసంస్థగా భారతవర్షమువంతకును ప్రాతినిధ్యము వహించుచున్నపుడు రెండు ప్రధానమతసంఘములవారిని-(హిందూమహాసభ-ముస్లింలీగు) వారిలోవారు సమాధానపడి కాంగ్రెసు కార్యసంఘమువద్దకు రప్పించిన కాంగ్రెసు బ్రిటిషుప్రభుత్వమునకు ఆదేశముల నివ్వగలసమర్థతలోనుండెడిది. అట్లుగాక హిందూమహాసభపేరెత్తక తామే [కాంగ్రెసే లేక గాంధియే] హిందూమహాసభతరఫున ప్రాతినిధ్యమువహించుచున్నామనుకొని ఇండియా కార్యదర్శిఆడించినట్లు ఆడుచు జిన్నాసాహేబు వెనుక రాజీయనిపోవుట హిందూమహాసంఘమునకు శ్రేయస్సుకాదు. కాంగ్రెసుకో భారతవర్షాధిపత్యమున్నట్లుకాదు.

## పూనా కాంగ్రెసు తీర్మానము

పూనాలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సంఘతీర్మానము కాంగ్రెసు చరిత్రలో ప్రాముఖ్యమైనది. "అహింస" కాంగ్రెసుకు రాజకీయ విధానమేకాని సిద్ధాంతముకాదన్న సంగతి స్పష్టవచనములతో నిర్వచింపబడెను ఈసందర్భములో వల్లభాయిపటేలు, రాజగోపాలాచారిగార్ల సాహసము ప్రశంసార్హమైనది. గాంధిగారవిన అచంచలభక్తిగల రాజాజీపటేలు యీరోజునకైనను గాంధిఅహింసాసిద్ధాంతము రాజకీయములో ఎల్లపుడు ఆచరణలోనుండ వీలులేదని తెలసికొనుటమంచిదే. బ్రిటిషువారు భారతవర్షమునకు స్వాతంత్ర్యమిచ్చితిమని ప్రకటించిననూ అహింస సిద్ధాంతప్రకారము సేనలుఆయుధములు అక్కరలేదనుచుండినఅర్థములేదు. గాంధి బ్రిటిషువారికి అహింసనను సరింపుడని యిచ్చినవిన్నపమును గమనించి బ్రిటిషురాజకీయవేత్తలు నవ్వుకొందురు. నైజాంప్రభువు అహింసనునమ్మికొని యుండుమనియు వైమానికనిర్మాణశాలను ప్రారంభింపవలదనియుగాంధిసలహానిచ్చినచో రాజకీయవేత్తయగుసర్. అక్బర్ హైద్రీగారుఎగతాళిచేయుదురు

ప్రపంచములో ఏదేశచరిత్రను సాకల్యముగ చదివిననూ యుద్ధములు, పోరాటములు యుండితీరును. ప్రకృతిఅహంకారముకల్లనే ఏర్పడినది. సృష్టిప్రారంభములో—అనగా కృతయుగములో కుటుంబవ్యవస్థనిర్మలముగ జరుగక నే తమకొకరాజునుప్రసాదింపుమని ప్రజలు బ్రహ్మనుకోరిరి. ఒకకుటుంబములో అన్నదమ్ములు లేక తండ్రికొడుకులు ప్రశాంతజీవితమును గడుపలేకున్నారు. మనుపుధర్మశాస్త్రమును వ్రాసిన్రాసి ప్రాణమువిసిగి "దుర్లభోహిశుచిర్నరః" [మనుష్యులలో పరమయోగ్యుడులభించుటకష్టము] అనెను. ప్రపంచములో ఏరాజనీతిశాస్త్రజ్ఞుడు అహింసను విశ్వాసము [Faith] తో సిద్ధాంతముగానంగీకరింపుమని వ్రాయలేదు.

మనదేశములో బుద్ధుడు తొలుతఅహింస సిద్ధాంతమును ప్రచారముచేసెను. బుద్ధుడు రాజకీయవేత్తగా యీప్రచారముచేయలేదుకాని ఒకమతప్రచారకుడుగాగావించెను. బౌద్ధమతవ్యాప్తివలన హిందూదేశ రాజకీయస్థితి అధ్వాన్నమై పరప్రాంతీయులకతిసులభముగ స్వాధీనమయ్యెను. కానీయీనాడు గాంధి ఒకరాజకీయవేత్తగా అహింసను ప్రచారముచేయుచున్నాడు. దీనివలన ముందు ముందు భారతదేశమునకెంత అపకృతికలుగగలదోయని మొన్నటిపూనాసభలో కాంగ్రెసుసంఘమువారు మేల్కొనుట సమ్మోదావహము సైన్యు-మిలిటరీ అక్కరలేనప్పుడే అహింస సిద్ధాంతము ఆచరణలోనికి వచ్చును.

కాంగ్రెసు అహింసను వదలకుండ రాజకీయవిధానముగా నిలబెట్టుకొనుట యుచితమైనది నైతికముగ అహింసయుత్తమమైనదేకాని రాజకీయములో స్థానములేదని చరిత్రలుఘోషించుచున్నవి. ప్రపంచనిత్యానుభవముచుట్టి తెలియుచున్నది. ఇంతటితో కాంగ్రెసులో గాంధీవిధానముక్రమముగవిరమింపబడునని చెప్పవచ్చును.

## హిందూమహాసభ / ఆంధ్ర మహాసభ

నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభాధ్యక్షులు హైదరాబాదు హిందూమహాసభలో ఆంధ్రులుచేరరాదనిచేసినవిజ్ఞప్తిపై విమర్శలు చాలాబయలుదేరినవి. ఆంధ్రమహాసభకును హిందూమహాసభకును ఏమీ సంబంధములేదని ప్రకటించియున్నచో చాలా బాగుండెడిది. ఆంధ్రమహాసభ తెలంగాణములోని ఆర్థిక సాంఘిక సారస్వతాదుల అభివృద్ధికొరకైకృషిసలుపుచున్నది. తెలంగాణములోని ఆంధ్రులలోహిందువులున్నారు. మహమ్మదీయులున్నారు క్రైస్తవులును—యింకనుఅనేకమతములవారునున్నారు. ప్రతిమతమువారును ఒకసంఘముగా ఏర్పడితీరెదరు. ముసల్మానులకు "ఇత్తెహాదుల్ముస్లిమీన్" యున్నది క్రైస్తవులకు వై.యం. సి ఏ. మరియుబాప్టిస్టువంటి వేరేసంఘములున్నవి. ఆయామతస్థులయభివృద్ధికొరకై వివిధసంఘములు ఏర్పడుచుండును శ్రీరామచంద్రరావు గారియుద్దేశము హిందువులు సంఘముగాఏర్పడరాదనియా! ఆంధ్రముస్లిములు, "ముస్లింఇత్తెహాదు"లోచేరరాదని ఆంధ్రసభాధ్యక్షులు ప్రకటించియుండిరా? ఇదేవిధముగ క్రైస్తవులకుహితవుచేసెదరా? కాంగ్రెసు—లీగుసంభాషణలలో "లీగుమహమ్మదీయులప్రాతినిధ్యసభ" గావంగీకరించుటకువాయకులుయిచ్చగించియుండిరే. బహుసున్నితరాజకీయవాతావరణములో హైద్రాబాదునందు హిందువులుసమావేశమగుచుండ ఆసభలో ఆంధ్రహిందువులుచేరరాదని ప్రకటించుట,అవసరములేనిపని ఆహిందూమహాసభవారు ఆంధ్రమహాసభ కార్యక్రమమునకడ్డుపడుచున్నపుడు ఎట్లుచేసిననూఅన్వయించునుకాని హిందూప్రజామండలివారుసమావేశమగుచున్నంతమాత్రాన యిట్లుప్రకటించుట సరికాదు. ఆంధ్రమహమ్మదీయులనెట్లుమాచెదరో అట్లేఆంధ్రహిందువులను ఆంధ్రమహాసభచూడవలెను.

[ఈ ఆంధ్ర-హిందూచర్చ ఇంతటితో ఆపివేయబడుచున్నది, గో,ప సం.]

అఖిలభారత కాంగ్రెసునందును, యితర ప్రదర్శనములందును అనేకములైన బంగారు, వెండిపతకములు, యోగ్యతాపత్రములు పొందినది.
( 100 సంవత్సరముల జయము )



డా॥ వారన్ గోపాల్
ఐడైజ్డ
సార్సపరిల్లా

వేలకొలదిమంది యిది మంచి రక్తశుద్ధి ద్రావకమని నిరూపించినారు.

ఇది రక్తమును శుద్ధిచేయుటయే గాక వృద్ధిపరచును. శరీరముపైనుండు నల్లనిమచ్చలను పోగొట్టును. చెడురక్తమువలన గల్గు బలహీనత, బద్ధకము, కండ్లజబ్బు, కాళ్లుచేతులు వాపు మొదలగు ట్లుటిలోను, వాతమునందును బాగుగా పనిచేయును.

వెల రు 1-4-0 పోస్టుఖర్చులు వేరు.

ఏజంటు: యం. డి. దత్తాత్రేయ అండ్ కో,
సుల్తానుబజారు, రెసిడెన్సీరోడ్, హైదరాబాదు,-దక్కన్

పాండురంగ
బ్రాహ్మీ తలనూనె
ట్రేడ్ P మార్కు

యీతలనూనె 21 వనమూలికలతో శాస్త్రోక్తముగా తయారుచేయబడి శరీరమునకు, మెదడునకు చల్లదనమునిచ్చి శిరోజములను వృద్ధిజేయును, మనోహరమైన సువాసనను గల్గియున్నది. యీ సుప్రసిద్ధతైలము లోకవ్యాప్తిజెంది అనేక యోగ్యతాపత్రములను బొందియున్నది.
మావద్ద ఉసిరికనూనె, మషాలనూనె, నవరత్ననూనె వగైరాలు సర్వదా లభింపగలవు.

స్టాకిస్టులు:-కింగ్ అండ్ కో., సుల్తాన్ రోడ్, హైదరాబాదు-దక్కన్.
పాండురంగ ప్రాడక్ట్స్ వాడి-జంక్షన్.

అందరూ ఈరోజునుండే పుచ్చుకొనుట ప్రారంభించండి.

ట్రేడ్ మార్కు



జాండు
ద్రాక్షాసవ
దేహమునకు మెదడునకు
ఉత్సాహమును గలిగించు
రుచ్యమైన ఔషధము.

జాండు ఫార్మావర్క్సు లిమిటెడ్-బొంబాయి
నిజాం ఏజంట్లు:
మెసర్సు, డి. జె. పారేఖ్ అండుకో—శికింద్రాబాదు.

సత్యమేవ జయతేనానృతమ్

రోగులు తమ మనోదౌర్బల్యముచే చిత్రవిచిత్రములైన ప్రకటనలను జూచి మోసపోవుచు ధననష్టమును ఆరోగ్యనష్టమును బొందుట సహజమే. పరిశీలించి నిజము తెలిసికొనుట ముఖ్యము.

లోకకల్యాణార్థము వైదికధర్మమును పునరుద్ధరించి, ఆర్యసమాజమునుస్థాపించిన త్యాగమూర్తి శ్రీదయానంద సరస్వతియను యోగిపుంగవుల పేరలాహోరులో స్థాపింపబడిన జగత్ప్రసిద్ధ డి. ఏ. వి. కాలేజియొక్క ఆధీనములో కేవలమాయుర్వేద ప్రచారమునకై "దయానంద ఆయుర్వేదిక్ ఫార్మసీ" అక్కడాని కనుబంధముగ నొకచికిత్సాలయము నిర్వహింపబడుచున్నది. ఈఫార్మసిలో నమ్మకముగ సిద్ధముచేయబడిన శాస్త్రోక్తములును, ప్రశస్తములునైన ఔషధములు సరసమైనధరలకు జిక్కును.

నిర్ధనులైనరోగుల కాహారము, వస్త్రములు ఔషధాలను దానముచేసిన పుణ్యామీ ఔషధములకొనువారు పొందగలరు. వలయువారు కావలసినఔషధములు మాకువ్రాసి వెంటనే తెప్పించుకొనగలరు. జాబులు రహస్యముగ నుంచబడును. హిందీ, ఉర్దూ, ఇంగ్లీషుభాషలలో కేటలాగులుచితము. నిజాంరాష్ట్రియులీక్రిందికి ఖకు వ్రాయవలెను.

Daya and Ayurvedic College Pharmacy.

హకీం జయరాంచాస్ వైద్యరాజ్

బ్రాంచి:— దయానందాయుర్వేదిక్ కాలేజ్ ఫార్మసి,
కోరి బస్ స్టాండ్, హైదరాబాదు-దక్కన్

నోటు:-శాఖాచైత్యశాలలో స్వయముగవచ్చు బీదలకు చికిత్సఉచితము.

యుద్ధము - భీమా
యుద్ధకాలములో భీమాకంపెనీలు అన్నిటికంటె సురక్షితమైనవి
ది హిందూస్థాన్ కోఆపరేటివ్
యిన్షూరెన్సు సొసైటీ లిమిటెడ్.
ఇండియాయొక్క గొప్ప భీమాసంస్థ
యుద్ధసమయమునందుగూడ మా వ్యాపారమపరిమితాభివృద్ధినందుచున్నది.
నిజాంరాష్ట్రమునందలి జిల్లాలలో ప్రత్యేక ఏజంట్లకొరకు దరఖాస్తులు కావలెను.
హిందూస్థాన్ కోఆపరేటివ్ యిన్షూరెన్సు సొసైటీలిమిటెడ్
(హెడ్డాఫీసు-కలకత్తా)

బొంబాయిబ్రాంచి, యస్. సి. మజుందార్, మేనేజరు { ఆస్తి-౯కోట్లకుపైన, చెల్లించబడిన క్లైములు 2 కోట్లకుపైన } హైదరాబాదు ఆఫీసు, 2001-బి. షాహరాహ ఉస్మాని, హైదరాబాదు-దక్కన్.

ఇండియాయొక్క గొప్ప భీమాసంస్థ

## గ్రామోద్ధరణసంఘము

నారాయణపురం

ఈగ్రామము నల్లగొండమండలాన్తర్గత జనగాంతాలూకాలో చేరినది. ఇక్కడి గృహముల సంఖ్య ౧౫౦౦ జనసంఖ్య ౧౧౫౦౦ లు, ప్రభుత్వమునకుచెల్లించునిస్తు దాదాపు రూ ౧౯౦౦౦ లవరకు కలదైవున్నది. ౧౫ అమర్దాదు ౧౩౪౯ సంవత్సరమున శ్రీయుత లింగాల బండారెడ్డిగారి ఆధ్యక్షతన ప్రభుత్వముచే గ్రామసముద్ధరణ సంఘము నియమింపబడి ప్రజామోదముబడసెను.

### అధికారులరాక

సంఘసభ్యులు ప్రతిశుక్రవారము సభజరుపుచున్నారు. అటుపై ౨౫ షహరేవర్ ౧౩౪౯ ఫసలీ నాడు అనగా సంఘస్థాపనజరిగిన ఒకటిన్నర మాసములోపలనే ప్రభుత్వాధికారులచే కటాక్షింపబడెను

అవ్వల్ తాలూకుదారుగారు, అబ్కారీమొహతమీం, మదదుగారు సాహెబు, మున్సఫ్ డాక్టరు, తాలూకా ప్రధానోపాధ్యాయులు గార్లువచ్చిరి.

వీరలను జయధ్వానములతో ౩౦ బాలబాలికలు ప్రార్థనాగీతములు పాడుచు యెదుర్కొని యథోచితముగా పుష్పమాలాలంకృతుల నొనర్చిరి, పిమ్మట గ్రామమును వీక్షించుచుఅచిరకాలములో నిర్మించినందులకు కొన్నిరెలలలో జరుగవలసిన కార్యములను రాజశ్రీ బండారెడ్డిగారిని ముక్తకంఠప్రశంసించుచు, గ్రామోద్ధరణ సంఘకర్తవ్యములను విపులపూర్వకముగా వివరించిరి

"గ్రామమును పరిశుద్ధిగ నుంచవలయును, పశువులఉత్పత్తి కొరకు వ్యవసాయదారునుండి అబోతు ... నుంచుకొనవలయును.

వ్యవసాయమునకు మంచివిత్తనములు తయారుచేయవలయును. తోటపరిశ్రమలు విరివిగా చేయబడవలయునుఅని వారలు ఉపన్యసించిరి. ఈగ్రామమున భావులు లేనందున హరిజనులకొరకు ఒకటి యితరులకొరకొకటి ఏర్పాటు చేయ ... నిర్ణయించిరి.

### ఆయుర్వేద వైద్యాలయము

ఆయుర్వేద వైద్యాలయముకొరకు ౨ ఉపాధ్యాయులుగల ప్రాథమిక పాఠశాలకొరకు, హైదరాబాదు వరంగలు రోడ్డుకు రాజమార్గము నిర్మించుటకొరకు బీదలు ఇండ్లుకట్టుకొనుటకై ౧౫౦ కాటిచెట్లను, రాజమార్గములకొరకు కూలగొట్టబడినగోడలను తిరిగి నిర్మించుటకు ౧౦౦ రూపాయీలు మంజూరీ చేయించగలమని ఉపన్యసించి గంటకాలము ఇష్టాగోష్ఠిగా సంఘాధ్యక్షులతో ముచ్చటించిరి

## త్రియంబకరావుగారి అష్టావధానము, తప్పుల కుప్ప

(సత్యదుర్గేశ్వరకవులు శతావధానులు)

నల్లగొండ, అగస్టు ౫

ఈ అగస్టునెల ౩ వతేదీ ఆదివారము నాడు సాయంత్రమున ఈ పురమందలి ఆంధ్రభవనమున శ్రీయుత పులిజాల రంగారావుగారి అగ్రాసనాధిపత్యమున శ్రీపతి త్రియంబకరావుగారు అష్టావధాన మొనర్చిరి. నిషేధాక్షరిభారము నామీద బడవేసిరి. సభికులు అవధానిగారు ఎంతో సగర్వపూరితముగ తమ కార్యక్రమమును ఉపక్రమించిరి. చివరకట్లో ధారణలో ౧౨, తప్పినను సభవిశ్శబ్దముగ ముగిసినది. తమపట నాకుగల సందేహములను శ్రీ అధ్యక్షులకు తెలియపరచితిని ఆవేవియో బయటపెట్టితిని. నిజమునకు అవధానిగారు సభాసరసత్వాన్ని గుర్తించిఉంటే తాము ప్రయోగించిన పదప్రయోగములు సాధువులైన సాధువులని సప్రమాణముగ రుజువుపరచవలసి ఉంటుంది లేదాతప్పులే పొరపాటని ఒప్పుకోవలసిఉంటుంది. ఆదీయిదీకాకుండా కొంతవరకు మొండివాదనకు గడంగిరి. చివరకు నాప్రశ్నకు పరియైన జవాబుశక్యకపోవుట అట్లు డగా తుదకు ఆ అవధానధురంధరుండు, ఇప్పుడుకాదు గోలకొండపత్రికాముఖమున అడిగినచెప్పెదనని ఏకోమాటకాలేరు సరే ముఖాముఖిని చెప్పలేనప్పుడేక పత్రికాముఖమునమాత్రం చెప్పగలిగేదేమిటి, అనిఅనుకొని-పోనీ అదెంతరమ్యంగా ఉంటుందో చూద్దాం అని వారినోటిమీద నే నడవడానికి సర్వవిధాలా నిశ్చయించుకొన్నాను

అది—ఉన్నటుల్లుండి............ కదేశార్దూల వృత్తంలో ఉన్న ఒక సమస్యా ... ద్యంలోనిది. ఈపద్యములో ... ఒకటేకాదు—... తప్పులున్నవి,అవి ... తిగణములు మొదలైనవి. కాని ప్రస్తుతం నేప్రశ్నింపదలచినది ఈఒక్కటియే అనగా—ఈ ఉన్నటుల్ ÷ ఉండి=ఉన్నటులుండి కావలయు గాని ఉన్నటుల్లుండి" అనియెట్లగును?ఇటువంటిదెనాక్కడైనా ప్రామాణిక ప్రయోగమున్నదా? లేక ఏప్రామాణిక ఆంధ్రవ్యాకరణములోనైనా దీనిని సమర్థించునూత్రమేదైనకలదా? అని అడిగినసభలో ఆప్రశ్న లేదిరిగి ఇప్పుడుఅడుగుచున్నాను. దీనికి అవధానిగారు పండితహర్షకరముగు తగినజవాబు అందించినయెడల నాకుగల తక్కినపద్యములలోని సంస్కృతవ్యాకరణమునకు సంబంధించిన సందేహములను, తప్పులనుకూడా ప్రకటింతును.

## శ్రీ నిజాం ప్రభువ రేణ్యులు

ఒ—వి.

గద్వాల ౬—౮—౪౦

మ ఘ. వ. నిజాంప్రభువుగారి జన్మదివసమునాడు సభజరిగెను అధికార, అనధికారసభ్యులు సభకువచ్చిరి, ఉపన్యాసాలుజరిగెను ప్రభుభక్తి ప్రకటింపబడెను

## తుం-ఆప్

లాహోర్ జిల్లా న్యాయాధికారి తన తాలూకాలలోని కచ్చేరీలకన్నింటికిని ఒకగస్తీపంపి ... ఇకముందు కోర్టువారుతమ ఆజ్ఞలలోను ప్రాతలలోను ఇతరులను సంబోధించునప్పుడు "తుం"(నీవు) అనుటకు మారుగా 'ఆప్, అనియుర్దూ వ్యవహారములలో నుపయోగించవలెను. అని ఆజ్ఞాపించినారు. "తుం"అనునది కేవలము నౌకర్లకే ఉపయోగింపబడునట్టిపదము. ఇకముందు నిందితులనుకూడ "ఆప్"అను పదముతోనే సంబోధించవలెను అనియు ఆజ్ఞాపించినారు.

## బాపనప్పకు మాదిగప్ప జవాబు

అన్నామలైనగరులో ఒకసాయంకాలము ఒకరాజవీధిలో ఒకబ్రాహ్మణవిత, తుప్ప జపమాలతో మడినీళ్లతో పోవుచుండెను ఎదురుగుండి ఒకపరయా (మాదిగ) స్త్రీ నెత్తిన పుట్టికపెట్టుకొని వచ్చుచుండెను, "ఒసేయ్"పక్కకు తప్పుకో భండాలముముండ" అని బాపనమ్మ చెడతిట్టెను. ఆమాదిగ స్త్రీ గంభీరముగా ఇట్లు జవాబిచ్చి తనబాటపట్టుకొనిపోయెను

"ఎందుకుతల్లీ ఇంతచీదరించుకొంటావు. మీకొడుకుల పొలాలను నామగడుదున్నినాడు నేను నాటెల్లిండ్లు వరినాటుపెట్టినాను. కలుపుతీసింది మేమే, కావలికాసింది మేమే, కోసింది కూడా మేమే, నూరి తొక్కింది కూడామేమే. నామగడు చావచావ వాటిని మోసి మీగుమ్మముకద్ద పెట్టి-చ్చె. నేనునామగడు పక్కకుతొలిగితే నీవునీపిల్లలు మలమల మాడుతారు. తెలిసిందా?"

## పద్మశాలి యువజన సంఘస్థాపన

ఒకవిలేఖరి

జోగిపేట మెహరు ౧

విక్రమశాలిగణ తు ౨౩ సోమ మంగళవారములు స్థానిక జోగిపాథాంధ్రగ్రంథాలయమున యువకులు సమావేశమై పద్మశాలికులాన్నతిం గురించి యిష్టాగోష్ఠిగా చర్చలు జరిపిరి. ఇందుకై ని—రా—పద్మశాలి మహాసభవారి తీర్మానానుసారము సంఘము అవసరమని యెల్లరి ఆమోదముతో "పద్మశాలి యువజనసంఘము" అనుదాని ... కార్యవర్గమున కెన్నుకొననైనది.

యాదగిరి చన్నయ్యగారు అధ్యక్షులు, యాదగిరి పతల్ గారు ఉపాధ్యక్షులు, కందినాగయ్యగారు కార్యదర్శి, ఇంకను వీరుకాక నాలుగుంది అవర్గములోగలరు.

ఎన్నికల—వంతరము కంది నాగయ్యగారు సంఘము చేయుపనులు సంఘనియమావళిని విపులముగాచదివి వినిపించిరి. ఇంకను ని—రా—పద్మశాలిమహాసభవారి తీర్మానములనుకూడ వినిపించి వాటినామోదించుటకై సభ్యులనుకోరిరి

## హైదరాబాదు హరికేన్‌నిధి

ఈనిధికి అగస్టు ౫వతేదిని కల్దారు ౩౧౫—౬—౦ లును, హాలీ ౬౦౭౬—౩—౭ లును వసూలయ్యెను అగస్టు ౭వతేదినాడు మొత్తము కల్దారు ౧౩౯౫—౪—౦ లున్ను, హాలీ ౭౦౬౯౯—౧౪—౬ లున్ను వసూలయ్యె ఈరెండవ మొత్తములో రాజా సురభి వెంకటజగన్నాధరావు (జటప్రోలు) గారు హాలీ రూ. ౨౫౦౦౦ లున్ను, వరంగల్లు ఆజంజాహిమిల్లువారు ఇచ్చిన హాలీ రూ. ౧౦౦౦ లున్ను గలవు.

అగస్టు ౮వతేదినాడు కల్దారు రూ. ౯౧౦, హాలీ రూ ౮౨౬౨—౦—౪ లు వసూలైనవి. మొత్తం లెక్కనంతా కల్దారులోకి మార్చగా ఇంతవరకు యీనిధికి రూ. ౪౨౯౮౦—౧౦—౦ లు వసూలైనవి.

## సంస్థానాల ముస్లింలీగు

హైదరాబాదు[దక్కన్] మెహర్ ౩

లీగుయొక్క కార్యకర్తలసమితి సమావేశము హైదరాబాదులో జరిగెను వారుయీయుద్ధములో బ్రిటిషువారికి సహాయం చేయవలెననీన్నీ, కాంగ్రెసువారు సంస్థానాలలో బాధ్యతకలిగించుకోవడం హానికరమనిన్నీ, మైసూరు మహారాజు ముస్లిములకు ప్రత్యేకనియోజకవర్గమిచ్చియుండిరనిన్నీ, వారుచనిపోయినందుకు తమవిచారము కలిగిందనిన్నీ తీర్మానము చేసుకున్నారు.

ఖాదీని రాజకుటుంబము కొనుట

హైదరాబాదు (దక్కన్), మెహర్ ౩

మహారాజా సర్ కిషన్ ప్రసాదుగారి కూతురున్ను మనుమరాలున్ను మ. ఘ. వ. వారి జన్మదినోత్సవసందర్భములో హైదరాబాదు సుల్తాన్ బజారులో ఖాదీవస్త్రాలయములో ఖాదీనికొన్నారు హైదరాబాదులో ఖాదీ ఇంకాఎక్కువ అమ్మకంకావలెనని తెలిపినారు

[హై. బు.]

## జై హింద్

### హిందూ మహాసభ చూడపోయినవారు

శ్రీయుత గోలకొండపత్రికా సంపాదకులకు

అర్యా?

తమ ౫—౮—౪౦ పత్రికలో సి యస్ నాయుడుగారు ఆంధ్రమహాసభాధ్యక్షులకు చేసినసూచనను చూచినాను. వారు తమనుతాము తప్పించుకొనుచు, ఇతరులపైన సత్యదూరమగునిందను వేశారు ఆహిందూమహాసభలో పాల్గొన్నవారిలో, నా పేరుగూడా ఉదహరించారు.

శ్రీయుత పసునుర్తి వెంకటలక్ష్మయ్యగారు నేను హైదరాబాదకు ఒకవ్యవహార సంరర్భంలో వెళ్ళెను. దూరాన్నుంచి నగరానికివెళ్ళిన తర్వాత,అక్కడ బ్రహ్మాండంగా జరుగుతూవున్న హిందూమహాసభమార్గాముని అభిలాష వుండటం సహజం, నేనైతేఆంధ్రమహాసభాభిమానిని అయినా, జాతీయవాదినయినా. ఆంధ్ర మహాసభతో, నాకు నియమావళిరీత్యా నాకెట్టి సంబంధములేదు. కానిపసునుర్తి వెంకటలక్ష్మయ్యగారు వరంగల్ జిల్లా కార్యనిర్వాహకసంఘసభ్యుడు,కాబట్టి ఆంధ్రమహాసభఆధ్యక్షుల ఆజ్ఞను అతిక్రమించకుండుటకే నిశ్చయించితిమి.

ఏసభలోను పాల్గొనుటఅంటే ప్రతినిధులుగా వుండటంఅని అర్థంగాని, ప్రేక్షకులుగాగూడవుండటంఅనిగాదు. ప్రేక్షకు లగాగూడ వుండగూడదని, ఎవ్వరుననిరోధించగూడదు. ఇది తెలిసివున్నప్పటికీ, మేమిద్దరం శ్రీమాడపాటి హనుమంతరావుగారితో ఈవిషయం తెలిపినమీదటనే వెళ్ళాము. అదయినా ప్రారంభసమావేశమును కొంతవరకుచూచాం, మళ్లిపోలేదుగూడాను, ఆ సాయంత్రంజరిగిన. ఆంధ్రయువజనసంఘ వార్షికోత్సవంలోగూడా పాల్గొన్నాము. నాకు తెలిసినంతవరకు మేమిద్దరమేకాక మరిఇద్దరు ఖమ్మం వాస్తవ్యులను లాళ్ళిశెట్టిలింగన్నగుప్తగారుకూడా ఇట్లాగెపాల్గొన్నారు. అంతేకాని ఆంధ్రమహాసభఆజ్ఞను ఉల్లంఘించలేదని తమపత్రికద్వారా తెల్లడించ ప్రార్థన.

ఖమ్మం ఇట్లు
7-8-1940- కోదాటి నారాయణరావు

ఇటీవల హైద్రాబాద పట్టణమున సమావేశమైన హిందూమహాసభలో నేను చేరియుంటినని పత్రికారచయితుల. శ్రీయుత సి-యస్-నాయుడుగారు ౩౦—౧౦—౪౯వతేది గోలకొండ పత్రికలో ప్రకటించినారు— ఇటువంటిబాధ్యతగల పత్రికారచయితలేక విశేషరితో ఈపొరపాటు జరిగినందుకు నాకువిచారముకలిగించెను. ఆంధ్రమహాసభ స్థాయిసంఘ కార్యదర్శినైయుండిఅధ్యక్షులవారి ప్రకటనేకాక వర్కింగు కమిటీవారి తీర్మానమైయుండగ నేను హిందూ మహాసభలో చేరుటఎట్లుసంభవించును? తీర్మానము ప్రకారము సాధారణప్రేక్షకులుగా చేరుటకు నిషేధములేకుండెను .అయినను ఒకసంస్థకు కార్యదర్శిస్థానములోనుండి హిందూమహాసభలో ప్రేక్షకునిగా వెళ్లినను పత్రికారచయితలకు విలేఖరులకుయుక్తాయుక్తములు గాభ్రమించుటకును, వర్కింగుకమిటీవారితీర్మానము యొక్క విలువను తగ్గించుటకు దుర్వినియోగపరచబడునని గ్రహించి హిందూమహాసభ ఆవరణలోనికైన యడుగుపెట్టలేదు,

నాపేరుతోబాటు గోలకొండపత్రిక సంచికలలో ఆ ప్రముఖుల నామావళి ప్రకటింపబడినది. ఈప్రముఖులలో ఎవరు ఆంధ్రమహాసభ కార్యకర్తలుఅయ్యివుండి హిందూమహాసభలో ప్రతినిధులుగా లేక ప్రేక్షకులుగావెళ్లినది స్పష్టపడవలసినవిషయము. ఈసందర్భమున ఆయాప్రముఖులతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపబడుచున్నవి. త్వరలోనే యథార్థము అధికార ప్రకటనద్వారా స్పష్టపరచబడును—

చిర్కేపల్లి రామచంద్రరావు
ఆంధ్రమహాసభ స్థాయిసంఘ కార్యదర్శి,

## సంస్కృతాంధ్ర కళాశాల

వరంగల్

శ్రీ గోలకొండపత్రికాధిపతిగారికి,

అయ్యా?

తామ ౧౫—౭—౪౦ తారీఖు గోలకొండపత్రికలో "సంస్కృతాంధ్ర కళాశాల నివేదిక" యను శీర్షికతో ప్రచురించినదానిని చూచినాము అందుగల తమసందేహములక్రిందిసమాధానములను విన్నవించుచున్నాము,

౧. మాకళాశాల విషయమున శేఖరించినమొత్తము కమిటీవారి యనుమతిచేతనే కోశాధికారిగారివద్ద నుంచబడినది,

౨. మూలధనమును సమకూర్చుటకై ప్రస్తుతము యత్నించుచుంటిమి ఆయత్నము సఫలమయినపిమ్మట ట్రస్టీసంఘ మేర్పరుపబడును.

౩ ఈ కళాశాలలో చాతుర్వర్ణ్యములవారును సంస్కృతాంధ్రములను జదువుచున్నారు. అట్టివారిని కమిటీవారియంగీకారముచే జేర్చుకొనబడుదురు,

౪ విద్యాశాఖాధికారులకు గ్రాంటుకొరకు దరఖాస్తుపెట్టియున్నాము. కొద్దిరోజులలో మరి జూరుకాగలదని నమ్ముచున్నాము,

ఇట్లు, కార్యనిర్వాహకవర్గము


**జీవితభీమా** వలన మాత్రమే ఏవ్యక్తి అయినను కొద్దికొద్ది కిస్తులరూపమున తన వార్ధక్యమున స్వతంత్రజీవనము గడపుటకును, లేక తన తదనంతరము తనబాధ్యులకు సహాయభూతముగా నుండుటకును తగినంత సొమ్మును సమకూర్చగలడు.

**ప్రతి సంవత్సరము** వేలకొలది వివేకవంతులైనవారు తమ వృద్ధాప్యమును తన బాధ్యులను ఆర్థిక స్వతంత్రముగా చేయుటకై పునాదివేయుటకు చాల ఉత్తమమైనదియు, ప్రజాదరణనందినదియు భారతీయ భీమాసంస్థయునగు

# "ఓరియంటల్"

నందు తమ జీవితములను భీమా చేయు చున్నారు.

ఆలస్యము చేయవద్దు

యీరోజే "ఓరియంటల్" పాలసీ తీసుకోండి.

వివరములకు:

డి. డి. మెహతాగారు
ఆక్టింగ్ బ్రాంచ్ సెక్రటరీ
ఓరియంటల్ లైఫ్ ఆఫీసు,
మహారాష్ట్రగరల్సు ఎడ్యుకేషన్ సొసైటీబిల్డింగ్సు
లక్ష్మిరోడ్డు,పూనాసిటీ.

యన్.సి. వర్మగారు, ఎం.ఎ.
923, గుల్బాగ్, ఆబిద్‌రోడ్డు,
హైదరాబాదు-దక్కన్.

రాష్ట్రములో పైకము వసూలుచేయుటకు యితర ఏర్పాట్లు:—

సికింద్రాబాదు, నాందేడు—ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్‌యిండియా,
వరంగల్, ఔరంగాబాదు, జాల్నా—సెంట్రల్ బ్యాంకు ఆఫ్‌యిండియా లిమిటెడ్.

## ది ఓరియంటల్

గవర్న్. సెక్యూరిటీ లైఫ్ ఎష్యూరెన్సు కంపెనీ లిమిటెడ్

స్థాపితము 1874 హెడ్డాఫీసు బొంబాయి

మేనేజరు హెచ్. ఎడ్విన్ జోన్సు. యఫ్.ఎ.ఎ.ఐ.ఎ.,



## సెంట్రల్ బ్యాంకు ఆఫ్ యిండియా లిమిటెడ్

స్థాపితము—డిశంబరు 1911.

అధికారిక మూలధనము రు. 3,50,00,000 చందావేయబడిన మూలధనము రు. 3,36,26,400
చెల్లించబడిన మూలధనము రు. 1,68,13,200 రిజర్వు, మొదలగునిధులు రు. 1,12,37,000
31—12—39 తేదినాటికి డిపాజిట్లు రు. 29,86,82,000

ప్రధానకార్యాలయం—బొంబాయి

నిజాంరాష్ట్రములో బ్రాంచీలు:—హైదరాబాదు, సికింద్రాబాదు, ఔరంగాబాదు, జాల్నా, సైలు, రాయచూరు, లాతూరు, వరంగల్, యాద్గిరి, కొప్పుల్, ఖమ్మం మెట్టు.

డైరక్టర్లు:—సర్ హెచ్. పి. మోడి కె.టి., కె. బి యి. అధ్యక్షుడు.
ది రైట్ ఆనరబుల్ నవాబు సర్ అక్బర్ హైదరీ, కటి. పి. సి.
అర్దేషిర్ బోమన్‌జీ దుబాష్‌గారు — హరిదాస్ మాధవదాసుగారు
దిన్షా డి. రోమర్ గారు — విఠల్ దాసు కంజిగారు
సర్ ఎ. ఆర్. దలాల్ గారు — నూర్ మహమ్మదు యం. చినాయ్ గారు
బాపూజీ డి. లాంగారు — ధరంసీమల్ రాజ్ ఖాటోగారు

లండన్ ఏజంట్లు: బార్ క్లేస్ బ్యాంక్ లిమిటెడ్.

అన్ని విధముల బ్యాంకింగ్ వ్యాపారములు జరుపబడును.

ప్రత్యేకవిషయాలు: హోంసేవింగ్స్ సేఫ్, ట్రావెలర్సు చెక్కులు, డిపాజిట్ల యిముల్ ... 5 మరియు 10 తులముల స్వచ్ఛమైన బంగారుకడ్డీలు, స్త్రీలకుప్రత్యేకశాఖ

హెచ్. సి. క్యాప్టెన్, మేనేజరు.

# గోలకొండ డైరీ త్వరలో వెలువడును.

## ఇండియాలో యుద్ధవిమానాల నిర్మాణము

అమెరికావారి సహాయ మర్థించుట

న్యూయార్కు, ఆగస్టు 3

యుద్ధవిమానములను యంత్రపరికరములను యితరపరికరములను కొని భారతదేశములోగల ప్రబల శక్తులన్నిటిని యుద్ధమునకై వినియోగించుకొను సంకల్పంతో ఇండియానుంచి బ్రిటిషు రాయబారులు అమెరికాకు వచ్చిరని "హెరాల్డు ట్రిబ్యూను" పత్రిక ప్రకటించింది. అమిషను లోవచ్చిన ముగ్గురుసభ్యులలో ఒకరు అమెరికాలో విమానాలను విరివిగాతయారుచేసేవారితో ఒకరితో రాయబారాలు ప్రారంభించిరని అమెరికానాయకత్వముక్రింద ఇండియాలో ఒకయుద్ధమూన నిర్మాణమునకై ఫ్యాక్టరీని స్థాపించే ఉద్దేశ్యమున్నదనికూడ చెప్పిరి.

## భార్యల వేలము

ఒక ౧౦౦ సంవత్సరాలక్రిందట ఇంగ్లండులో భార్యలను వేలమువేయుచుండిరట!

"బర్మింగ్‌హాంజర్నల్" అనుపత్రికలో ౧౮ సెప్టెంబరు ౧౮౩౫లో యిట్లువ్రాసియుండిరట...

"శ్రాస్లిక్ అనేపట్నంలోని కచ్చేరీలో మొన్న బుధవారము ఒకపెండ్లాము వేలము జరగెను. అమ్మువాడు బ్రిక్‌స్కాంట్ నివాసి కొనేవాడుఆమ్మెవాని భార్యనుంచుకొన్నవాడు. సవాల్ "అరక్రాన్" అనగా సుమారు ౨రూపాయలు అప్పుడే కొంటాక్టును ఒకపత్రముమీద వ్రాసుకొని వేలంపూర్తిచేసుకున్నారు."

## అల్వారుసంస్థాన ప్రజామండలి

అల్వారుసంస్థానాధికారులకును. ప్రజామండలి నాయకులకును జరిగినరాయబారముల ఫలితముగా ౯వఆగస్టుసెలగవతేదినాడు ఆ ప్రజామండలి రిజిష్టరుచేయబడినది-ప్రభుత్వములో ప్రజాప్రతినిధులకు అంతకంతకెక్కువ సంబంధము కలిగించుటకును రాజకీయములను గురించి మండలివారు ప్రచారంచేయుటకు, శాసనబద్ధులై ప్రభుత్వమువారికి తెలుపుచుండుటకును అధికారులు సమ్మతించినారు-

## శ్రీ॥ శ్రీ॥ మైసూరు మహారాజుగారు

భారతదేశమంతట సంతాపము

మైసూరుమహారాజుగారి మరణముచే మైసూరుసంస్థానములోనివారికే గాక భారతదేశములో అనేకప్రాంతములవారికి విషాదము కలిగినది. శ్రీ మాన్ సి. రాజగోపాలాచారి మున్నగు కాంగ్రెసు ముఖ్యులును మదరాసు కార్పొరేషనువంటి పురిపాలకసంఘములునుకూడ విషాదనలను ప్రకటించినారు. తిరువాన్కూరుసంస్థానములోను, కపుర్తలసంస్థానములోను ప్రభుత్వకార్యాలయాలకు ఆగస్టు౫వ తేది మైసూరుమహారాజుగారి గౌరవార్థము సెలవొసగబడెను. బికనీరు సంస్థానంలో పతాకములగుడ్డలు ధ్వజమధ్యమునకు విషాదసూచికార్థము దింపబడెను.

## భారతప్రభుత్వముచే మిలిటరీ డ్రిల్లు నిషేధము

పండిత జవహర్లాలుగారి అభిప్రాయము

భారతప్రభుత్వమువారు ఇతరులు మిలిటరీ యూనిఫారములవంటి దుస్తుల ధరించి మిలిటరీ డ్రిల్లుచేయుటతగదు అని నిషేధించుటవల్ల ఇపుడు కాంగ్రెసు కార్యసంఘమువారు వెంటనే దీనినిగురించిఆలోచించి కర్తవ్యమును నిర్ణయించెదరని ఆగస్టు ౫వ తేదినాడు అలహాబాదులో ప్రకటించినారు. కాని ప్రభుత్వమువారి ఆజ్ఞ ననుసరించి కాంగ్రెసువారిప్పుడు తమవాలంటీరుల దళములను నిషేధించవలసిన అవసరములేదనిరి- పూర్వమువలెనే ఇపుడును వాలంటీర్ల శిక్షణము నిచ్చుచుండగలరనిరి. కాని కాంగ్రెసువాలంటీరులు మిలిటరీయూనిఫారములవంటి దుస్తులను మాత్రము ధరించరాదనిరి.

## హాల్వెల్ స్మారక స్తంభ సత్యాగ్రహ ఫలితాలు

కలకత్తా, ఆగస్టు౨

హాల్వెల్ స్మారక స్తంభ సత్యాగ్రహమునందు ౨౧౭మంది అరెస్టుచేయబడిరనియు, వీరిలో ౪౫మహమ్మదీయులనియు బెంగాల్ అసెంబ్లీలో నొకప్రశ్నకు ప్రత్యుత్తరమొసంగుచుహోంమంత్రి సర్ నాజిముద్దీనుగారుచెప్పిరి మహమ్మదీయసత్యాగ్రహులు లాఠీలతో కొడలగొట్టబడిరని చెప్పినమాటసత్యముకాదని ఆయనచెప్పెను.

## వైస్రాయి ప్రకటనపై దేశనాయకుల అభిప్రాయములు

వైస్రాయిగారి ప్రకటనపై గాంధిమహాత్ముడు ఎట్టిఅభిప్రాయమును గాని ప్రకటించుటకు నిరాకరించినాడు. కాంగ్రెసునుండి సంపూర్ణముగా తొలగిపోయినతర్వాత అట్టిఅభిప్రాయమీయజాలనని చెప్పినాడు. కాంగ్రెసుఅధ్యక్షులగు మౌలానా ఆజాదుగారు తాను వైస్రాయిగారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచున్నందువల్లను, బొంబాయిలోగాని, ఢిల్లీలోగాని ఆగస్టు౧౧వ, ౨౦వతారీఖులలోగా వైస్రాయిగారితో మాట్లాడమున్నందువల్లను ప్రస్తుతము వైస్రాయిగారి ప్రకటనను గూర్చి తానెట్టిఅభిప్రాయమును గాని చెప్పజాలననిరి.

వైస్రాయిగారి ప్రకటనను గూర్చి ఆలోచించుట ఆవసరమని గాంధిమహాత్ముడును, కాంగ్రెసు అధ్యక్షుడునుతలంచుచో కాంగ్రెసు కార్యవర్గము వారు ప్రకటనను పరిశీలించగలరు. కాబట్టి, ఈలోగా తాను అభిప్రాయమును చెప్పుట తగదని శ్రీమాన్ సి. రాజగోపాలాచారిగారు చెప్పిరి-

త్వరలో ముస్లింలీగుకార్యవర్గమువారు సమావేశమై ఆలోచింతురుగనుక తానిపుడేమియు చెప్పజాలనని జిన్నా గారనిరి-

## అధినివేశ స్వపరిపాలనము

డెమొక్రెటికు స్వరాజ్య పార్టీ తీర్మానాలు

పూనా: ఆగస్టు౨

డెమొక్రాటికు స్వరాజ్యపార్టీవారీ క్రింది తీర్మానము చేసినారు.

"వెస్టుమినిస్టరుచట్టంలో తెలుపబడిన అధినివేశ ప్రభుత్వమువారు వెంటనే ప్రకటించవలెను గవర్నరుజనరలు కార్యనిర్వాహకసంఘ సభలో ఇండియాలోవున్న అన్నిరాజకీయపార్టీల ప్రతినిధులుకూడా వుండవలెను.

౧౯౪౦డిసెంబరునెలాఖరున యిపుడున్న భారతశాసనసభలను రాష్ట్రీయశాసనసభలనుకూడ రద్దుచేసి మరలయెన్నికలజరుపవలెను. క్రొత్తశాసనసభలు యేర్పడినవెంటనే భారతప్రజాప్రతినిధిసంఘములో సభ్యులుగావుండుటకు తగినవారనితోచిన వారిని కొందరిని యెన్నుకొనవలెను. వీరు శాసనసభలకుయెన్నుకొనబడిన సభ్యులుగానే వుండవలెను. ఇట్లుయెన్నుకొనబడిన ప్రజాప్రతినిధి సంఘమువారు భారతదేశానికి తగిన రాజ్యాంగవిధానమును సిద్ధపరచుటకు కాలావధినికూడ నిర్ణయించవలెను. ఈసంఘమువారు సిద్ధపరచిన విధానమును బ్రిటిషుప్రభువుగారును భారత దేశీయులును ఆమోదించవలెను. ఈరీతిగా బ్రిటిషు ప్రభుత్వమునకునుభారతీయులకును ఒడంబడిక జరుగవలెను. ఆటుతరువాత లండను పార్లమెంటులో చట్టము చేయబడవలెను ప్రజాప్రతినిధిసంఘ సభ్యులలో యేవిషయమునుగురించిగాని అభిప్రాయ భేదము కలిగినట్లయిన వటినిశాసనసభలవారు పరిష్కరించవలెను. ఇట్లుఅభిప్రాయభేదము కలిగిన విషయములనుగురించిమాత్రమే ప్రభుత్వమువారు ఆటుతరువాత నిర్ణయించవలెను.

శాసనసభలలో అధికసంఖ్యాకులఅభిప్రాయము బ్రిటిషుకామనువెల్తులోని స్వతంత్ర దేశములలోవున్న పద్ధతి జాతిసమితివారుచేసిన నిబంధనలు వీటినన్నిటినిబట్టి ప్రభుత్వమువారునిబంధనలను నిర్ణయించవలెను.

## ప్రజాప్రతినిధి పరిషత్తు సూచన

బెంగాల్ అసెంబ్లీ నిరాకరణ

కలకత్తా, ఆగస్టు౨

"భావిభారత రాజ్యాంగవిధానము ప్రజాప్రతినిధిపరిషత్తుచే నిర్మింపబడవలెను. ఈపరిషత్తు భారతదేశమునందలి వయసువచ్చిన యావన్మంది ప్రజలచేనెన్నుకొనబడవలెను సదరురాజ్యాంగ విధానములో మహమ్మదీయ హక్కులును, యోగక్షే మములను పూర్తిగా రక్షింపబడవలెను ఈ హక్కులు, క్షేమములు యేవో పరిషత్తునందలి మహమ్మదీయ సభ్యులచేమాత్రము నిర్ణయింపబడవలెను, ఇతరమతములప్రతినిధులుగాని, విదేశీయులుగాని ఈనిర్ణయమునుమార్చ వీలులేదు ఈలోగా కేంద్రమునందును, రాష్ట్రములయందును జాతీయ ప్రభుత్వములేర్పరుపబడవలెను. కేంద్రమున బాధ్యతాయుతప్రభుత్వ మేర్పడవలెను. ఈప్రభుత్వములో వివిధరాజకీయపక్షముల ప్రతినిధు లుండవలెను" అనుతీర్మానమును బెంగాల్ అసెంబ్లీవారు నేడు నిరాకరించిరి.

ఈతీర్మానమును జులై౧౯ తారీఖున కృషిక ప్రజాపక్షసభ్యుడగు మక్బుల్ హుస్సేన్‌గారు ప్రతిపాదించియుండిరి. ఆనాడురెండుగంటలు చర్చ జరిగినతరువాత ప్రతిపాదకుడు తీర్మానమునుపసంహరించుకొనగోరెను. కాని సభవారు అనుమతింపలేదు. తీర్మానముపై చర్చసమాప్తము చేయవలెనని కాంగ్రెసుపార్టీవారుగావించిన ప్రతిపాదనముపైతము నిరాకరింపబడెను. సదరు తీర్మానముపై నేడుచర్చజరిగెను. అరగంట చర్చజరిగినతరువాత తీర్మానము నిరాకరింపబడెను.

## ప్రపంచములోని మోటర్లు

౧౯౩౮వ సంవత్సరము లెక్కలప్రకారము ప్రపంచములో మొత్తం౪కోట్ల ౨౯ లక్షల ౧౧వేల ౫౧౫ మోటార్లున్నవి. ఈమోటర్లలో కేవలము ప్రయాణంచేసెమోటార్లుచేరినవి ఇంజను మోటార్లు, మోటారుసైకిళ్లు, ట్రాక్టర్లుచేరలేదు వివిధదేశాలనుబట్టిచేస్తే యీవిధంగా మోటార్లున్నవి అమెరికాసంయుక్తరాష్ట్రములో ౨కోట్ల ౯౨ లక్షల ౧౧౬౫౨.

ఇంగ్లాండులో ౨౫ లక్షల ౪౨ వేల౨౯౪.

ఫ్రాన్సులో ౨౨ లక్షల ౫౦ వేలు.

జర్మనీలో ౧౪ లక్షల ౪౪౯౬.

కనడాలో జనసంఖ్య ౧౧ లక్షల ౭౧ వేయి ౧౦౫ మంది,

కనడాలోమోటార్లు౧౧లక్షల౬౧ వేయి౬౯.

హిందూస్థానములో ౧ లక్ష ౭౮ వేల౧౨౫ మాత్రమే,

అందులోనే ౫౦౬౪౬ బస్సులున్నవి.

మనకంటెఅధ్యాన్నము జపానుదేశము అచ్చట ౧ లక్ష ౪౦ వేలు మాత్రమే.

## "జాతీయగీతములు"—నిషేధం

హైదరాబాదు (దక్కన్), మెహర్ ౩

మంత్రిప్రగడ వెంకటేశ్వరరావుగారు రచించి ముద్రించిన "జాతీయగీతములు" అనేపాటల పుస్తకములు హైద్రాబాదు ప్రభుత్వంవారు నిషేధించినారనిన్నీ, మంగళవారమునాడు కొన్ని దుకాణాలలో ఆ గ్రంథాలమ్మకానికి పెట్టియుండగాపోలీసువారి వాటినిలాగుకొని పోయినారనిన్నీ హైద్రాబాదు బులెటిన్‌లో ప్రకటింపబడినది.

## పురపాలకసంఘము

హైదరాబాదు(దక్కన్), మెహరు౩

హైదరాబాదు పురపాలకసంఘములో ము. ఘ. వ. నిజాంగారి ఫర్మానుప్రకారము ఎన్నికలోవచ్చిన ప్రతినిధులకాలము ఒకసంవత్సరము హెచ్చింపబడినది. ఆవిధముగా ప్రభుత్వమువారిచే నియమింపబడినసభ్యుల కాలపరిమితినికూడ ఒకసంవత్సరము హెచ్చించుటకై పురపాలకసంఘమువారు కోరినారు.

మన్సబ్

హైదరాబాదు (దక్కన్) మెహరు౩

మిలిటరీశాఖ మంత్రిగారగు నవాబ్ ఖుసూర్ జంగు బహద్దరుగారికి నెలకు ౧౫౦ రూపాయల మన్సబు ప్రత్యేకమిచ్చుచుండిరి. మధ్యకాలములో అది ఆపివేయబడియుండెను. మరల యిప్పుడు ము.ఘ.వ. నిజాంప్రభువుగారి ఫర్మానుచే ఆ ౧౫౦ రూ॥ల మన్సబు అనుగ్రహింపబడినది,

## సర్ కిషన్ ప్రసాదుగారి సంస్థానం

హైద్రాబాదు(దక్కన్). మెహరు ౩

మహారాజా సర్ కిషన్ ప్రసాదు బహద్దరుగారి సంస్థానానికి మిర్జామహమ్మద్ బేగుగారు జాజంగాను సుందేరావుగారు కేషన్ జడ్జిగారు నియమింపబడినారు.

## అమూల్యమైన మా ప్రచురణాలు

### తగ్గింపుధరలు. ౧౫ దినాలవరకు మాత్రమే

౧- నిజాంరాష్ట్ర పరిపాలనము- కర్త. సురవరము ప్రతాపరెడ్డిగారు ౧౦౦ ప్రతులు మాత్రమే మిగిలినవి. మరల ముద్రింపబడదు. ధర ౬ అ- ఇప్పుడు ౪ అణాలు-

౨- ఉచ్ఛలవిషాద నాటకము- కవి. సురవరముప్రతాపరెడ్డి. కల్హణ కవీంద్రుని ౯౦౦ ఏండ్లక్రిందటి కాశ్మీరదేశ చరిత్రయగు రాజతరంగిణిననుసరించి వ్రాయబడినది.

ధర ౧౨ అ- ఇప్పుడు ౮ అణాలు

౩- గోలకొండ కవులసంచిక- ౩౫౩ రాష్ట్ర కవుల ఉత్తమ కవితయిందుగలదు. ౨౦౦ పూర్వకవుల చరిత్రకలదు. అట్టి చారిత్రిక పరిశోధనతో కూడికవులచరిత్ర కమూల్యమైన సహాయకారిగానున్నది. పుటలు ౪౫౦. సైజుడబుల్‌క్రౌన్. దీనికిపోస్టేజిఖర్చే ౧౦ అణాలు.అనేకపటాలున్నవి

అస్సలుక్రయము ౨ రూపాయలు. ఇప్పుడు ౧ రూపాయి మాత్రమే.

(ముందే క్రయము టపాన్వ్యయము పంపితేనేపంపబడును.)

౪. సుధాలహరి. ౭౫౦ ఏండ్లక్రిందటి ప్రాచీన జైనకవియగు అమితగతిసూరి రచితము, మనోహరమగు నీతిశ్లోకాలు. వాటికి తెనుగు పద్యాలు, తెనుగు తాత్పర్యము.

వెల ౨ అణాలు. ఇప్పుడు ౧ అణా

౫. కవి కర్ణామృతం. మేల్నాటి లక్ష్మయ్య విరచితము. పాటలు, పద్యాలు కలవు. ౧౧౦ పుటలు. ౧౦౦ ప్రతులు మాత్రమే. వెల ౨ అణాలు మాత్రమే.

౬- కృష్ణార్జున సంవాదము- కవి నాదెండ్ల గోపప్రధాని. ౫౦౦ ఏండ్లక్రిందటివాడు ఇది ద్విపదకావ్యము. ౧౨౦ ప్రతులు. మాత్రమే మిగిలినవి,మరలముద్రింపబడదు,గయోపాఖ్యానముకథ-

వెల- ౬ అణాలు- ఇప్పుడు 3 అణాలు

౭- రెడ్డికుల నిర్ణయ చంద్రిక—శేషాద్రి రమణ కవులు, ౨౦౦ పుటలు.

ధర రు- ౧-౪-౦- ఇప్పుడు ౧౨ అణాలు

**గమనిక:—**

ప్రతులుకొద్దిగనే యున్నవి-ఈ ధరలు ౧౫ దినాలవరకే-తర్వాత ఈవిధముగాతక్కువధరలలోదొరకవు- గ్రంథాలు అసలేదొరకకపోవచ్చును-

దొరకు స్థలము:— గోలకొండ పత్రికాలయము.

## మెహాధ్వంసిని

శరీరమును కృశించి మానవుని జీవచ్ఛవముచేయు శిరంగిపుండు, మేహవాయువు, మేహవ్రణము; మేహాజ్వరము,చర్మవ్యాధులు, కీళ్లనొప్పులను "మేహాధ్వంసిని" నివారించి, రక్తమును శుద్ధిపరచి నరములకు శక్తినిచ్చును. సేవించుటకు రుచికరము హెచ్చుగా పథ్యములేదు

పెద్దసీసా 1కి రు. 4-0-0

మీడియం ,, 2-4-0

చిన్నసీసా ,, 1-2-0

ది లస్టర్ మాన్యుఫాక్చరింగ్ కంపెనీ, చిక్‌పేట్, బెంగుళూరుసిటీ.

ఏజంట్లు:-పి. వెంకటస్వామి అండ్ సన్సు,

ఇంపీరియల్ పోస్టాఫీసుయెదుట, హైద్రాబాదు-దక్కన్.

లక్ష్మీస్టోర్సు సికింద్రాబాదు రైల్వేస్టేషన్ ఎదుట, సికింద్రాబాదు.

ఇంకను చదివినారా లేదా?

## హిందువులపండుగలు

సు. ప్రతాపరెడ్డిగారి ప్రణీతము

పుటలు ౩౦౦. ౪ చిత్రపటములు. ౧. కృష్ణుని తిరునక్షపటము

(అపూర్వమైనది. సరియైనరూపముతో నుండునది!)

వెల ౧ రూపాయి మాత్రమే.

దొరకుస్థలము: —గోలకొండపత్రికాలయము.

## జర్మనుల క్రొత్తజలాంతర్గాములు

బ్రిటిషువారి తగిన ప్రతీకారాలు

జర్మనుల టార్పెడోబోట్లు క్రొత్తరకము ఇటీవల డన్కర్కునుండి బ్రిటిషుసేనలు ఇగ్లండుకు చేర్చబడిన సందర్భములో ప్రయోగింపబడెను. ఈజర్మను టార్పెడోబోట్లు "ఈ" బోట్లు అనబడును. ఇవి ౧౦ అనుగులవెడెల్పువరకు కలవైయున్నవి. గంటకు ౩౭ మైళ్ళుమొదలు ౫౫ మైళ్ళవరకు పోగలవు. ఈబోట్లు ఏకధాటీని ౭౦౦ మైళ్లవరకు పోగలవు. ఒక్కొక్కబోటులో ౧౮ మంది నావికులుండవచ్చును. ఫిరంగుషెల్లులను కాల్చగల ఫిరంగియున్న ఆరంగుళం నాళిం గల ఫిరంగులున్న వానికి౫ టార్పెడోలుకూడా వీనిలోకలవు. డన్కర్కు వద్దనుండి బ్రిటిషు సేనలను నావలమీద కెక్కించుకొని పోవుచుండినప్పుడు జర్మను "ఈ"బోట్లు బ్రిటిషు యుద్ధనావలను ముంచుట చాలాయత్నించెను. కాని బ్రిటిషుసేన-ఇంగ్లాండుకు చేర్చబడెను ఈబోట్ల ప్రయోగములవల్ల ఇంగ్లాండు సముద్రతీరమునకు భయముకలుగకుండా చేయవలసిన బందోబస్తులన్నియు చేయబడినవి బ్రిటిషునావము రామీదకు కూడా "ఈ" బోట్లు దండెత్తివచ్చెను. థేమ్సు నదీ ముఖద్వారమువద్దకుకూడా వచ్చెను. కాని అవి బ్రిటిషునావలకు హానిచేయలేదు.

---

## శ్వేతముఖుడు జంతుదమనుడు

సుంగాంలోని అడవులలో షికారీకై కొందరు ఇటీవల వెళ్లినారు. అచ్చటి పెద్దపులులలో నొక తెల్లని అజానుబాహువు అగుమనిషి కనబడినాడు అతడు యువకుడు వేటకుపోయినవారిలో జేమ్సుమెక్‌డఫ్ అనేవారు దీనినిచూచి అశ్చర్యపడినాడు. టార్జన్ అనేవాడు అడవులలోని జంతువులకంతా నాయకుడని ప్రసిద్ధి. అట్టిటార్జనువలెనే యీయువకుడును ఒకయీల వేసినాడు. వెంటనే పులులన్నీ గర్జించినవి. వేటకాండ్రు భయపడి చెట్లకెగబ్రాకిరి అంతలోనే మేక్‌డఫ్‌పై ఒక పెద్దపులిమూకెను. ఆదేక్షణములో మరొకయీలవేసుకొంటూ యువకుడు చెట్లలోనుండీ పులిపైపడి దుమికెను పులి తోక ముడుచుకొని పారిపోయెను. మూర్ఛపోయిన డఫ్‌ను ఈ అపరటార్జన్ చేతులలో ఎత్తుకొని అతనిస్నేహితులవద్దకు తీసుకొనిపోయెను ఈ విచిత్రవ్యక్తి వేటకాండ్రను ఎగాదిగా వినోదంగా చూచెను. వేటకాండ్రొక కత్తినివానికియ్యగా దాన్నిచూచి చాలా ఆనందించెను చేసన్నలతో వేటకాండ్రను అభినవటార్జన్ తనవెంటతీసుకొనిపోయి తనగుహను చూపించెను. అందుపిట్టలు, పిట్టపిల్లలు, పాములుకూడనెను

వానివయస్సు ౨౦ ఏండ్లుండును. అతనికిన్ని జంతువులకున్నూ ఏదో ధ్వనిభాషకలదు. తన గుహను చూపించినతర్వాత యువకుడు మరల పెద్దఈలవేసి ఒకచెట్టుపైకెగిరి మాయమయ్యెను. అప్పుడే ఒకడజన్ పులులతోకలాడించుచు బయటికివచ్చెను వాటిలో ఒకదానిపై టార్జను ఎక్కి సవారిచేయుచు మాయమైపోయెను. నగరములోనికి తిరిగివచ్చినతర్వాత తాముచూచిన ఈ ఘట్టాన్ని వేటకాండ్రు ఊరువారికి తెలుపగా ఒక్కకిల్లసేరి గర ఏండ్లక్రిందట బ్యారీవిల్లిస్ అను ప్రభుత్వోద్యోగియొక్క ఆరేండ్లబాలుడు తండ్రివెంట వేటకుపోయి అచ్చటమాయమయ్యెను. వానికొరకై చాలా వెతికిరికాని దొరకనందున ఆకృషి చాలించుకొనిరి. ఆపోయినపిల్లవాడు తప్పకుండా వీడేఅని కనుమానము కలిగినది. వీడిప్పుడు అసన్నర కడుగుల యెత్తువాడట మహాబలాఢ్యుడట. వానిని వెదకితెచ్చుటకు ప్రయత్నాలు చేయుచున్నారు.

---

## ఫ్రాన్సుయుద్ధములో కండ్లుపోయినసైనికులు

ఫ్రాన్సులో ఇటీవల జరిగిన యుద్ధములో ౧౧౩ మంది బ్రిటిషుసేనలలోని సైనికులు ఒక కన్నుగాని, రెండుకళ్లుగాని, చూపుగాని పోగొట్టుకొనిరని కామన్సుసభలో ఒకప్రశ్నకు ఈడెనుగారు జవాబునిచ్చిరి.

---

## ఖాక్సారులపై చర్య అనవసరము

బెంగాలుప్రభుత్వ వైఖరి

ఖాక్సారు ఉద్యమములలో హిందువులు సిక్కులుకూడ పాల్గొనుచున్నారనియు, సంఘసంస్కారణమే దానిఉద్దేశ్యమనియు, పంజాబులో ఖాక్సారులనుగురించి విచారించిన కమిటీ చేసిన సిఫారసులను తాము పాటించవలసిన అవసరములేదనియు. శాసనవ్యతిరేకముగా నడువనంతవరకు చర్యతీసుకునవలసిన అవసరము లేదనియు వాలంటీరు సంస్థలన్నిటిపట్ల అవలంబించదగిన వైఖరినిగురించి యోచనజరుగుచున్నదనియు దేశీయాంగమంత్రి నాజీముద్దీనుగారు బెంగాలు అసెంబ్లీలో ప్రశ్నసమయమున బదులుచెప్పిరి బెంగాలులో ఖాక్సారులు మసీదులలో నివసించుటలేదనిరి. ఈ ఉద్యమమునకు స్థానికముగా వసూలైనచందాలుతప్ప ఇతర ఆర్థికాధారము కనబడదనిరి.

---

## పంజాబులో ఊరేగింపుల నిషేధము

పంజాబురాష్ట్రములో ౩౭ పెద్దపట్టణములలో పెండ్లిఊరేగింపు చావుఊరేగింపులుతప్ప మిగతఊరేగిపులేవియు జరుగగూడదని ప్రభుత్వమువారు నిషేధించిరి. కలహకారణము కాదని తోచినయెడల మతసంబంధమగు ఊరేగింపులకు జిల్లా మేజిస్ట్రేటు లైసెన్సు యిచ్చును. పెండ్లి చావు ఊరేగింపులకైనను లైసెన్సు పొందవలసియుండును.

---

## గీతానువాదము గవర్నరుచేయుట

సింధుగవర్నరుగారగు ఎచ్-ఇ-సర్ లాన్సిలట్ గ్రహాంగారు భగవద్గీతను ఇంగ్లీషునుండి సింధీలోనికి భాషాంతరీకరించుచున్నారు ఈగవర్నరుగారు సింధీభాషలో బాగా పరిచయము కలవారు గవర్నరుగారి ఉద్యోగ కాలముమును సంవత్సరము పరిపూర్తియగును, అంతలోఈ గ్రంధాన్ని సింధీలోవ్రాసి ముద్రించి గ్రంథాలు ఉచితంగా పంచిపెట్ట తలచినారు.

---

మీ స్వవిషయసమస్యలన్నియు పరిష్కారం కావలెనంటే!

# అమోఘంగా పనిచేయు
# ఈ దివ్యౌషధములను ఉపయోగించండి.

మాకు చేరిన వేలకొలది ప్రశంసాపత్రములే వాటి పూచీని నిరూపించుచున్నవి.

| | | |
|---|---|---|
| జిన్‌సిన్ బంగారు మాత్రలు - బలమునకు శక్తికి అమోఘమైనది ... | ధర రు. | 4-0 |
| సుఇఫాస్‌సి (ద్రావము) - వీర్యస్తంభనమునకు దివ్యౌషధము ... | ,, | 6-0 |
| మలాం - (పై పూతకు) నరబలహీనత్వమును పోగొట్టి పటుత్వమును నొసగును... | ,, | 5-0 |
| చిపాలూం (పేస్టు) - ఒంట జిత్తించిన గనేరియాకు దివ్యౌషధము ... | ,, | 4-0 |
| పాలూంయన్ (కాప్స్యూల్సు) - తీవ్రగనేరియాకు మూత్రకోశపు జబ్బులకు దివ్యౌషధము | ,, | 3-0 |
| చిమాయ్‌డక్ (మిశ్రమము) - అన్ని సుఖరోగములకు దివ్యౌషధము ... | ,, | 3-0 |
| పాక్‌టాయ్‌యన్ (పైపూతకు) - కుసుమరోగమునకు దివ్యౌషధము ... | ,, | 2-8 |
| చికింగ్‌కి - స్త్రీల ముట్టుకడుపునొప్పులకు, తదితర జబ్బులకు మాత్రలు ... | ,, | 3-8 |
| చిట్ యక్‌టాన్ - సంతాననిరోధమునకు యెట్టి అపాయము కలుగకుండా వాడవచ్చును | ,, | 4-0 |
| చిలన్‌షీన్ - తామరకు దివ్యౌషధము, గాయముగాని, మచ్చలుగాని పడవు | ,, | 0-12 |
| సప్‌చాన్‌కో - యొగ్జిమాకు దివ్యౌషధము (ఇతరులకు అంటుకొనదు) ... | ,, | 1-0 |
| ఇహాంగ్ పోసెన్ (మిశ్రమము) - పసిబిడ్డలకు గొప్ప బలవర్ధకౌషధము. మంచి ఆరోగ్యము నొసగును | | 1-0 |
| చీకో - రక్తము వచ్చుచున్నను రాకున్నను మూలశంకకు దివ్యౌషధము ... | ,, | 1-8 |
| హాచన్‌యన్ (మాత్రలు) - మూలికలచే తయారుచేయబడినరిఉబ్బసమునకు అద్భుతముగ పనిచేయును | | 2-8 |
| హాచన్‌యిప్ - ఉబ్బసమునకు ఔషధయుక్తమైన అకులుపీల్చినవెంటనే రోధ తగ్గించును | ,, | 1-0 |
| సాయ్‌యర్ (మాత్రలు) - మలబద్ధకమునకు దివ్యౌషధము. అజీర్తికి, ప్రేగుజబ్బులకు ఉపయోగపడును | | 0-12 |
| ఖాట్-యర్ (మాత్రలు) - దగ్గులకు, రొమ్మునొప్పికి, రొంపకు దివ్యౌషధము | ,, | 1-0 |
| చిఫంగ్‌సప్ - కీళ్లనొప్పులకు దివ్యౌషధము. యెముకల నొప్పులకు ఉపయోగపడును | ,, | 14-0 |

పోస్టేజీ ప్రతి పార్సెలుకు అ 8 లు ప్రత్యేకము.

ఉచితము:- శరీర ఆరోగ్యమునకు సంబంధించినవిషయములు అన్నియు చిత్రపటములతో సహా పొందుపరుపబడిన మా 44 పేజీల క్యాటలాగున్నూ ఏవిషయాంతరభాషలో నొక క్యాటలాగున్నూ, మాకు వ్రాసిన వెంటనే ఉచితముగా పంపబడును, 16 సి. యం ఎస్. ప్రక్రియలు పూర్తివివరములతో వ్రాయబడినవి.

సి. యం. యస్. ఔషధము లన్నియు క్రొత్తవి సీలువేసి, బాగుగా ప్యాకింగు చేయబడిన స్థితిలో మా సోల్ సెల్లింగు యేజెంట్ల వద్ద నున్న ధరలపట్టీ ననుసరించి అమ్మబడును:—

డి. జె. పారెఖ్ అండ్‌కో., హైదరాబాదు అండ్ శికింద్రాబాదు:



జే. బాలాభాయి అండ్‌కో., 260, చైనాబజారు రోడ్, మద్రాసు.

ప్రాగ్‌లాల్ అండ్ సన్సు, 51, అర్కాట్ శ్రీనివాసాచార్ స్ట్రీటు, బెంగుళూరు సిటీ.

చైనీసు మెడికల్ స్టోర్ (స్థాపితము 1930)

హెడ్ ఆఫీసు —౯8 అపోలో స్ట్రీట్, ఫోర్టు, బొంబాయి,

బ్రాంచీలు:—అహమ్మదాబాదు, ఢిల్లీ, మరియు కలకత్తా.

# ఆంధ్ర ఇన్షూరెన్సు కంపెనీ

(లిమిటెడ్)

హెడ్ ఆఫీసు:-మచిలీపట్నము

# మా కంపెనీ పట్టాదార్లకు హెచ్చరిక

కొన్ని కారణములవలన ఆంధ్రబ్యాంకు శాఖను హైద్రాబాదునుండి ఎత్తివేయుటవలన ఆబ్యాంకునందు మాకంపెనీ ఖాతాకు తమ ప్రిమియము వాయిదాలను జమకట్టుచుండు మాపాలసీదార్లు ఇకముందు అట్టిబ్యాంకు పేరట మనియార్డర్లు పంపకుందురుగాక.

ఈనెల మొదటివారమునందు మాకంపెనీ అక్కౌంటును సెంట్రల్‌బ్యాంకు ఆఫ్ ఇండియాలిమిటెడ్ హైద్రాబాదునందు తెరచితిమికాబట్టి హైదరాబాదునకు ప్రిమియములు పంపు మాపట్టాదార్లు వారిప్రిమియములను సెంట్రలుబ్యాంకు ఆఫ్ ఇండియాలిమిటెడ్., హైద్రాబాదునకు పంపగలరు.

సికింద్రాబాదునందున్న సెంట్రలుబ్యాంకు శాఖయందుకూడ మా కంపెనీ అక్కౌంటుకలదు.

ఇట్లు
గాడేపల్లి జగన్నాధం,
చీఫ్ ఏజంట్
కింగ్స్‌వే, సికింద్రాబాదు.

సంవత్సరము చందా
౬ పావలి రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సంచందా
౧౮-౦ కల్దారు,
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Popular Paper
That reaches
The masses
In the Dominions
Best Medium
for
Advertisement

**Volume 15** **Hyderabad-Dn.** **Monday 12 August 1940** **Number 29**


## బాల్కను, బాల్టిక్ ప్రాంతాల స్థితి

### రుమేనియా హంగరీల సంప్రతింపులు

బాల్టిక్ ప్రాంతంలో లట్వియా రాజ్యము యొక్క అధ్యక్షుడు లట్వియాను సొవియట్ లో చేర్చుకొనవలసిందని కోరెను. తదనుసారముగను క్రెంలిన్ సొవియటు సంఘవారు అగస్టు ౫వ తేదినాడు లట్వియాను చేర్చుకొనెను.

ఫిన్లాండు ప్రధాననగరము హెల్సింకిలో అగస్టు ౭వ తేదిరాత్రి (రష్యామిత్రులు) అనుపార్టీవారు కమ్యూనిజమునకు సంబంధించిన కేకలతో గోలచేసిరి. ఆపార్టీ మూలపురుషుడు ఫిన్నిషు పోలీసులచే అరెస్టుచేయబడెను.

క్రొత్తగా ఫిన్లాండునుండి రష్యా పొందిన ప్రదేశముతో కలిపి ఏర్పాటు చేయబడిన కారెలో ఫిన్నిష్, రిపబ్లిక్ యొక్క సొవియటు సంఘమునకు ఆటో కూసెనెన్ గారిని రష్యావారు ఉపాధ్యక్షునిగ ఏర్పాటుచేసిరి.

బాల్టిక్ ప్రాంతములో రుమేనియా వ్యవహారమే ముఖ్యము, రుమేనియా ప్రతినిధి హంగరీ ప్రతినిధితో ట్రాన్సిల్వేనియా విషయమై రాయబారాలు సాగించుటకుముందు హంగరీప్రధాన నగరము బుడపెస్టునకుపోయి ప్రాథమిక విషయములనుగూర్చి సంభాషించిరి. ఆసంభాషణలు పూర్తియగుటచే రాయబారములకై హంగరీప్రతినిధి రావలెనని రుమేనియా ప్రతినిధి ఆహ్వానించినాడు. ఇక రెండుమూడు రోజులలో బల్గేరియా ప్రతినిధితోగూడ రుమేనియావారు డోబ్రుజా విషయమై సంభాషించగలరు.

ఈలోగా రుమేనియా ప్రధాని గిగుర్తుగారు అగస్టు౭తేది బ్రాడ్ కాస్టు ఉపన్యాసము చేయుచు హంగరీ ట్రాన్సిల్వేనియా కావలెనను కోరికను వదలుకొనవలెననియు కావలసినచో ట్రాన్సిల్వేనియాలోని హంగరీప్రజలచే హంగరీప్రభుత్వమువారు వాపసురప్పించుకొని హంగరీదేశములోని రుమేనియాప్రజలను రుమేనియాకుపంపించు ఏర్పాటు చేసికొనవచ్చుననియు, మరియొకమార్గాన ఇరుపక్షములకును సామరస్య మేర్పడజాలదనియుచెప్పిరి, బల్గేరియా విషయములోకూడ నింతేయనిరి, రష్యాకు అంతముఖ్యప్రదేశము నిచ్చివేయుటవలన ఇక రష్యాతో స్నేహము వృద్ధికావలెననికోరిరి.

రుమేనియాలో యూదులకు ఉద్యోగములు చిక్కకుండును. ఇతరవిధములైన ఆటంకముల నేర్పరచుచు ప్రభుత్వాజ్ఞలు చేయబడినవి. రుమేనియానుండి ౧౧౫౦౦౦మంది జనులు బసరేబియాకు వెళ్ళిపోయినారు. మరికొందరు రష్యాకే వెళ్ళినారు.

బ్రిటిషువారు పట్టుకొనిన మూడు రుమేనియా ఓడలలో ఒకటి వదలివేయబడినది, కానిఇప్పుడు మరొక క్రొత్తవివాదాంశము జతగూడినది. అదేమనగా రుమేనియాలో బ్రిటిషుప్రభుత్వపు రాయబారిగానిరోగించినదూతనొకనిని రుమేనియాపోలీసులు బాధించి అతడుకొనిపోవుచున్న సందేశమేమిటో అడిగిరి. అతడు చెప్పననిచెప్పగా రివాల్వరుతో బెదరించిరి. ఈవిషయమై రుమేనియాలోని బ్రిటిషు రాయబారి రుమేనియాప్రభుత్వమువారు విచారణచేయవలెననికోరినారు.

### రష్యా అమెరికాల సంబంధములు

రష్యాకును అమెరికాకును క్రొత్తవాణిజ్యపు ఒడంబడిక కుదిరినదని చెప్పియున్నాముకదా!

ఇపుడు రష్యాలో అమెరికావారు [illegible] నిలుపుకొనువిషయమై ప్రయత్నములు చేయుచున్నారు అమెరికాలో వాషింగ్టనులో రష్యా రాయబారియగు ఔమాన్ స్కీ గారితో అగస్టు ౭వ తేదినాడు ఈసందర్భమునవే అమెరికా ప్రభుత్వపు తాత్కాలిక స్టేట్ సెక్రటరీ సమ్నర్ వెల్సుగారు సంభాషించిరి,

రష్యానౌకలు పసిఫిక్ మహాసముద్రములో యుద్ధకౌశల ప్రదర్శనములను చేసినట్లు వార్త వచ్చినది,

### రష్యా బ్రిటను వర్తక సంబంధములు

మాస్కో సంప్రతింపులనుగురించి బట్లరుగారి ప్రకటన

లండను, అగస్టు 3

వర్తకపు టొడంబడిక విషయమై బ్రిటను రష్యాప్రభుత్వములు జరుపుచున్న సంప్రతింపులగురించి వివరములు తెలుపవలయునని నేటిదినము కామన్సుసభలో అడుగబడిన ప్రశ్నలకు బట్లరుగారు ప్రత్యుత్తరమిచ్చుచు ఇట్లుచెప్పిరి

బ్రిటిషుప్రభుత్వపు రాయబారి సర్ స్టాఫర్డు క్రిప్సుగారు మాస్కో చేరగానే రష్యాప్రభుత్వపు వర్తకశాఖమంత్రితో సంప్రతించి, వర్తకపు టొడంబడిక గావించుకొనువిషయమై బ్రిటిషుప్రభుత్వమువారు అభిప్రాయములను తెలిపిరి, ఈవిషయమై రష్యాప్రభుత్వపు అభిప్రాయములను త్వరలో తెలియజేయవలెనని వర్తకశాఖమంత్రి వారాగ్గాన మొసగెను మరల వర్తకశాఖమంత్రిని సందర్శించి సంభాషణలు జరుపవలెనని కోరుచు ఇటీవల హాలిఫాక్సు ప్రభువుగారు సర్ స్టాఫర్డు క్రిప్సుగారి కొక సందేశమంపిరి, ఈసంప్రతింపులు త్వరలోనే ముగియవలయుననియు, రెండుదేశములకు లాభకరమగు ఒడంబడిక త్వరలోనే కుదురవలయుననియు బ్రిటిషుప్రభుత్వము వారు కోరుచున్నారు. ఇరాను, స్వీడను, జర్మని ప్రభుత్వములతో వర్తకపుటొడంబడికలు గావించుకొని రష్యాప్రభుత్వమువారు సంభాషణలు జరుపుచున్నారు,

బ్రిటనులోని వర్తకపు ప్రముఖులు [illegible] బారముగ మాస్కోకు వెళ్లి [illegible] సందర్భమున సర్ స్టాఫర్డు క్రిప్సుగారికి తోడ్పడవలయునని ఒక సభ్యుడు సూచించెను. సర్ స్టాఫర్డు క్రిప్సుగారికి సలహానొసగుట వర్తకవిషయములందు మంచి అనుభవముగల ఒక నిపుణుడు వారితోపాటు మాస్కోకు పంపబడిరి వర్తకపుటొడంబడిక ఏవిధముగనున్న బ్రిటిషుప్రభుత్వమునకు సమ్మతముగనుండునో హాలిఫాక్సు ప్రభువుగారు సర్ స్టాఫర్డు క్రిప్సుగారికి విశదపరచియున్నారు. ఈపరిస్థితులలో వర్తకరాయబారవర్గమును మాస్కోకు పంపుటవల్ల ఎక్కువలాభముండదనియు, ప్రభుత్వమువారు పంపిన వర్తకనిపుణుని సహాయముతో సర్ స్టాఫర్డు క్రిప్సుగారే రాయబారము [illegible] ప్రభుత్వమువారు తలచుచున్నారని బట్లరుగారు చెప్పిరి

క్రిప్సుగారు మాల్టావును సందర్శించుట

మాస్కో, అగస్టు [illegible]

మంగళవారమునాడు సర్ స్టాఫర్డు క్రిప్సుగారు రష్యావర్తకశాఖమంత్రి [illegible] గారిని సందర్శించి మాల్టావ్ [illegible] సాయంకాలము సర్ క్రిప్సుగారు మాల్టావుగారిని [illegible] చి సంభాషణలు జరిపిరి,

## జర్మను విమానాలతో బ్రిటను ఘోరమైన పోరాటాలు

### అనేకములైన జర్మనువిమానాల నష్టము

బ్రిటనుపై జర్మనువిమానాలదాడులు ౭వ, ౫వ తేదులలో జరిగినతర్వాత మూడురోజులు లాగి మరల అగస్టు 3 వతేదినాడు విపరీతముగ విజృంభించినవి,

అగస్టు 3 తేది మొత్తము ౭ జర్మనువిమానాలును, ౭వ తేది మొత్తము 3 జర్మనువిమానాలును బ్రిటిషువారిచే క్రిందకూల్చబడినవి. అగస్టు ౯వతేది ఒకజర్మనుబాంబరు విమానము క్రిందకూల్చబడెను.

అగస్టు ౧౧వతేది ఉదయము బ్రిటిషు ఓడలపై బాంబులువేయుటకు జర్మనువిమానములు వచ్చినపుడు బ్రిటిషువిమానాలకును జర్మనువిమానాలకును ఘోరమైనపోరాటము జరిగెను. ఆపోరాటములో ౬౦ జర్మను విమానాలు క్రింద కూల్చబడెను. బ్రిటిషువారికి ౧౬ మాత్రమే నష్టమైనవి. ఒక బోటుమునిగిపోయెను, ఇంకొకటి చెడెను. మూడుపడవలు టార్పెడో దెబ్బలచేమునిగినవి. అనేకములైన ఓడలకుచాల దెబ్బలుతగిలినవి. బ్రిటిషు విమానాలు తుదకువాటినితరుమగొట్టినవి. అర్థగంటసేపు పోరాటమునడచెను. ఒకనావికోటారు టార్పెడో పడవనుకూడ బ్రిటిషువిమానాలు కలేప్రాంతములో ముంచివేసెను.

అగస్టు౧వతేది ఉదయము జర్మనువిమానాలు రాగా బ్రిటిషువారు ఒకదానిని సముద్రంలోకి కూలద్రోసిరి. ఆదేరోజు మధ్యాహ్నముతర్వాత ఒకజర్మనువిమానము ఇంగ్లాండుమీదికివచ్చి బాంబులు వేయుటచే చాలనష్టముకలిగెను. ఇదేరాత్రి జర్మనువిమానాలు బ్రిటనుపై అంతటను తిరిగి బాంబులువేసెను. ఆదెబ్బలో వందలకొలదియిండ్లు పాడైనవి.


ప్రభాత్ ఫిలింవారి 1940 కానుక

సంత్ జ్ఞానేశ్వర్

== శాంతారాం == (డైరెక్టర్)

WHILE OTHERS PLAYED WITH GAY ABANDON

HE PREACHED EQUALITY TO MANKIND

సాహు మోడక్
యశ్వంత్
సుమతి గుప్తే
నటించిరి.


## మతవిచార సంఘాలు

హైద్రాబాదు(దక్కన్) మెహరు ౭

ప్రభుత్వప్రకటన శాఖవారిట్లు తెలుపుచున్నారు.

హిందూముస్లిం మతవిచారణ కమిటీరిపోర్టునైనది ఇదివరకే తెలిపినారు. అవి తమతమసంఘములో సంఘసంస్కార కార్యాలనుచేయును ఈసంఘాలు ప్రభుత్వానికిన్ని ప్రజలకున్ను లంకె (Lnik) గా నుండును. జనులకు ప్రార్థనాస్థలములోని అవసరాలను తెలుపువనిగానుండును. ఈసమితులు మతసంస్థలను పరీక్షించును, జనులకు ప్రార్థనాలయములోని అవసరములనుగూర్చి తెలుపును.

ఈ అనధికార సంఘములు హైద్రాబాదు నగరములోనే పనిచేయును. జిల్లాలలో ఇట్టికమిటీలు స్థాపించబడలేదు, ఈనగర సమితులు జిల్లాలలో పర్యటనచేయవు,

## క్రొత్తజర్మనీ సామంత రాజ్యాలు

ఫ్రాన్సులోని ఆల్సేస్, లోరైను, లక్సెంబర్గు జర్మనీసామ్రాజ్యంలో సామంతరాజ్యాలుగా చేర్చవలెనని హిట్లరుఆజ్ఞయైనది. తదనుసారము వాటికి గవర్నర్లు ఏర్పాటు చేయబడినారు.

ఫ్రాన్సులో పెటెయిన్ ప్రభుత్వమువారుజర్మనీపై ఫ్రాన్సుదేశము యుద్ధము ప్రకటించునట్లుచేయుటకు కారకులైనదలాడియర్, రేనోమున్నగు నూరుమంది నాయకులను విచారణచేసి శిక్షవేయుటకు ఒకసుప్రీంకోర్టు నేర్పాటుచేసినారు.లండనులో ఉండేడీగాల్ గారికి మరణదండన విధించబడినది. డీగాల్ గారికి ఈసంగతితెల్పగా వారు జర్మనీని ఓడించినతర్వాత తాను ఫ్రెంచిప్రజలఆజ్ఞకుతప్ప, మరిదేనికి బద్ధుడను కాననెను.

### జర్మనీపై బ్రిటిషు విమానాలు

జర్మనీపైనను, జర్మనీఆక్రమించిన దేశాలపైనను బ్రిటిషువిమానాలు అగస్టు౭వ, ౯వతేది, ౭వ తేదులలోతిరిగి యథాపూర్వకముగా సైనికప్రాముఖ్యముగలవాటిపై బాంబులువేసినవి. ౭వతేదినాడు నార్వేపైపోయిన ఒక బ్రిటిషువిమానము తిరిగిరాలేదట.

### నౌకల నష్టాలు

అగస్టు ౫వతేదినాడు రెండు బ్రిటిషు జెస్తనావలు శత్రువుల పురుగునలకు తాకి నీటమునిగెను. ఐర్లండు పడమటితీరప్రాంతములో అగస్టు ౭వతేది ఒకనౌకమునిగెను ఇదేరోజు మరియొక బ్రిటిషు జెస్తనావకూడ సముద్రంలో మునిగెను.


Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor- S. Prathapa Reddy B. A. B. L.